# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

*

సంపుటము : 66 ఏప్రిల్ 1989 సంచిక : 4

విడిపత్రిక వెల ఐదు రూపాయలు

## విషయానుక్రమణిక
ఏప్రిల్ 1989

# స్వ విషయం

"ఇదొక పరమాశ్చర్యకరమైన రచన. ఇందులో చండ ప్రచండులైన నాచన సోమన, శ్రీకృష్ణదేవరాయలు, తెనాలి రామకృష్ణుడు– ఇలాంటివారు కనిపిస్తారు" అని కీ.శే. విశ్వనాథ సత్యనారాయణ అంతటివారిచేత ప్రశంసించబడ్డ ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావు గారి "కుమార భారతి"లో కుమార జననం జరిగిన విధానంపై డాక్టర్ హనుమంతప్పగారు వెలువరించిన వ్యాసం ఈ సంచికలో కనిపించి సాహితీ సుగతులకు సంతృప్తిని కలిగించగలదు.

హిందీ మొదలయిన ఉత్తరదేశ భాషల చరిత్ర గత మూడు లేదా నాలుగు శతాబ్దాలకే పరిమితం అని చెబుతూ ఆచార్య జాస్తి సూర్యనారాయణగారు తమ "ప్రీహిందీ – తెలుగు" వ్యాసంలో ప్రకటించిన భాషాసంబంధమైన ఎన్నో విషయాలు పరిశోధకులకు రుచికరంగా ఉండగలవు.

శ్రీ పెన్నా శివరామకృష్ణగారి "ప్రతీక" పరిశీలన ప్రపంచ సాహిత్య దృక్పథంపట్ల సింహావలోకనానికి వీలు కలిగించగలదు. అలాగే శ్రీ నాయని సత్యనారాయణరావుగారి పాలమూచాపురి–కనక జంభనపురి వ్యాసం "శాసన" ప్రియులకు ఎంతో విలువైన సమాచారాన్ని అందించగలదు.

"చితి మీది బతుకులు" ఏ స్థాయిలో ఆలోచిస్తాయో ఏ గిరులు గీచుకుని ఉంటాయో తమ కథానిక ద్వారా శ్రీ కొచ్చర్లకోట వెంకట సుబ్బారావుగారు వెల్లడి చేసారు. కాగా కీ.శే. కోదండరామయ్యగారి వ్యాసం భారత రచనకు నన్నయ రంగాన్ని సిద్ధం చేసిన వైనాన్ని గురించి బాగా లోతుగానే తెలుపుతుంది.

ఇకపోతే ఈ సంచికలో అందిస్తున్న కవిత్వం గురించి ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరంలేదు. శ్రీ దిలావర్‌గారి "ప్రవాహం", శ్రీ సోమసుందర్‌గారి "తృషావర్తం", శ్రీ మణిగోపాల్ గారి "శవ సంస్కారం" శ్రీ గన్ను కృష్ణమూర్తిగారి "ఆశా నిరాశల మధ్య" వంటి రచనలు భిన్నమైన ఆలోచనలతో నిండి ఉండి ఎన్నో రకాల భావాలకు ఊపిరులు పోస్తాయి.

తెలుగువారి సంస్కృతికి ప్రతిబింబంలా ఉండాలన్నదే భారతి ధ్యేయం.

# శ్రీ కేతకీసంగమేశ్వరము

## శ్రీ దేశపతి గోపాలకృష్ణ

శ్రీమత్పర్వత రాజనందినీపతి
పశువులము మాకీవపతి-గతియు
విరించి కరకమల ప్రతిష్ఠిత-రాతి
లింగమయ్యావు గానేమి! మనస్సున
గంగమ్మ తలపై, బాలేందు రేఖ
సర్పహారమ్ము, నేన్గుతోలు మైదాల్చి
నిండి-నన్బిలచుకొంటివా-వచ్చితి-
నీ సేవకునై కేతకీ సంగమేశ్వరా! ఝరాసంగనిలయ!
వెండి తొడవేభక్తుడు చేయించెనో-విశేషము!
దండివేలుపా! నీలలోహిత కళావర్ణముల
నిండుకొంటివాయెద నాజ్ఞానచక్షువుల
బహిశ్చక్షువులందునను! త్రిపురారి
కేతకీ సంగమేశ్వరా! ఝరాసంగనిలయ!
కుండమున స్నానమెంతయు హాయిగూర్చె
ఉండినదొక దత్తాత్రేయ విగ్రహము తీరమున
నారికేళ ఫలోదకాభిషిక్తు గావించి-నీకు
హారతి కర్పూరమున వెలిగించినాను
కేతకీ సంగమేశ్వరా! ఝరాసంగ నిలయ!
నలువహంసపై నెగిరి యాకాశ దిగ్భాగమెల్ల దిరిగి
అలసిపోయి యచటి లింగరూపమున కంతము జూడలేదు
హరియు క్రోడమై పాతాళమెల్ల త్రవ్వి
క్రింద నీ రూపున కంతమున్ జూడగా జాలలేదు
మొగిలిపూవిది యసత్యమ్మని సాక్ష్యమ్ము వల్కె
దానిని సుమముగా నీవు గుర్తింపక పూజకనర్హమని-యంతట
ఇచట మాత్రము పూజింప మెచ్చినావట! నీ దయాగుణము!!
నెంతని పొగడవలె, కేతకీ సంగమేశ్వరా! ఝరాసంగనిలయ!
భూతి యేమైన నిచట పూయువారులేరె!
పత్రియున నిచట లభింపదొ! తెలియను
అట బ్రహ్మయును నిన్నీ కుగ్రామవాసిగా నిలిపె!
కదళీఫల నివేదనమైన చూచి సంతోషింపుమా!
కేతకీ సంగమేశ్వరా! ఝరాసంగ నిలయ!

---

"ఝరాసంగమ్" అను గ్రామమున జహీరాబాద్ సమీపమున బ్రహ్మప్రతిష్ఠితముగ చెప్పబడు నిరాడంబర సనాతన శివక్షేత్రము సందర్శించి వ్రాసిన కవిత యిది.

డా॥ ఎ. హనుమంతప్ప

# కుమార భారతి - కుమార జననం

ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావుగారు తమ 28వ ఏటనే 'కుమార భారతి' అన్న కావ్యాన్ని దివ్యమైన శైలిలో రచించారు. విశ్వనాధ సత్యనారాయణగారి మాటల్లోనే చెప్పాలంటే 'ఇదొక పరమాశ్చర్యకరమైన రచన. ఇందులో ఎవరో చండప్రచండులైన నాచన సోమన్న - శ్రీకృష్ణదేవరాయలు- తెనాలి రామకృష్ణుడూ - విశ్వనాథ సత్యనారాయణ - ఇల్లాంటివారు కనిపిస్తారు.' ఈ కావ్యం అన్ని కావ్యాలవలె ఆశ్వాసాలుగా కాకుండా కమలాలుగా విభజించబడింది. ఇందులో ఆరు కమలాలు ఉన్నాయి. షణ్ముఖుడైనటువంటి కుమారస్వామి వృత్తాంతాన్ని చెప్పే ఈ కావ్యం ఆరు కమలాలుగా విభజించబడటంలోనే ఒక ప్రత్యేకతను సంతరించుకొంది. కావ్యం కుమారస్వామికే అంకితం చేశారు. స్వామికే అంకితం చెయ్యటంలో కవికి కుమారస్వామిపట్ల ఉన్న అత్యంత భక్తి తెలుస్తోంది.

కుమారస్వామి జన్మం కోసం అగ్నిదేవుడు, గంగాదేవి పడ్డ అవస్థలను ఒక అందమైన వింత పద్ధతిలో కవి చెప్పిన రీతులు, కృత్తికామతల్లులు కుమారస్వామి దగ్గరకు వచ్చి క్షీరమిచ్చే సందర్భం (చతుర్థ కమలం కొంత భాగం వరకు) ఈ వ్యాసంలో పరిశీలించటం జరిగింది.

కథా ప్రారంభం శరత్కాలపు వెన్నెలతో ప్రారంభమయింది. చల్లని వాతావరణంతో గంగానది ప్రవాహంలోని సోయగాలతో కావ్యం మొదలుపెట్టడం కవికి ప్రకృతిపట్ల ఉన్న సౌందర్యారాధన మనకు తెలుస్తుంది. ఆ సౌందర్యానుభూతిని పాఠకులకు చక్కగా అందించగలిగాడు. దేవేంద్రుడు, బృహస్పతి కలిసి రహస్యమందిరంలో ఏవో మంతనాలాడుతున్న సమయంలో ముల్లోకాలు దద్దరిల్లేట్లుగా భయంకరమైన ధ్వని ఆకాశాన్ని చీలుస్తూ వస్తుంది. ఈ శబ్దం శత్రువుదై ఉండవచ్చునా లేక ఎవరిదైన ఉండవచ్చు అన్న సందేహం ఇంద్రునికి వస్తుంది. దేవగురువు—బృహస్పతితో ఆలోచనచేసి ఆతని సలహామేరకు ఈ శబ్దమెవరిదో కనుక్కొని రావడానికి వీలైతే వాసితో పొందు (సంధి) చేయడానికి పురుషులనుకాని, అప్సరసలనుకాని పంపడం కంటే సప్తమాతృకలైన కృత్తికలను పంపడం శ్రేయస్కరమని, ఆ తల్లులను వేడుకొని పంపిస్తాడు-ఇంద్రుడు. (ఆ సప్త మాతృకలు — చాముండి, కౌమారి, బ్రాహ్మి, మాహేశ్వరి, వారాహి, వజ్రాణి, వైష్ణవి అనువారు).

ఇంతలో మళ్ళీ మొదటవచ్చిన ధ్వని రావడంతో ఇంద్రుడు పటపట పళ్ళు కొరుకుతూ వజ్రాయుధం దూసుకుంటూ వెళతాడు. అతనివెంట సైన్యమెల్లనూ పోవలసినదే. ఆ పెద్ద సైన్యం ముందు శరీరంమీద ఎటువంటి కవచ, వస్త్రాదులు లేనటువంటి వాడు, చేత శివధనుస్సు ఉన్నటువంటి ఒక చిఱుత (చిన్నారి) బాలుడిని చూసి బృహస్పతి మొ.వారికి వెనుకటి సంఘటనలను జ్ఞప్తికి తెస్తూ బ్రహ్మదేవుడు కుమార జన్మగాథ వినిపించినట్టుగా కవి కథను నడిపించాడు.

తారకాసురుడు, వాని తమ్ముడు మహిషుడు వరబలోద్ధతులై కన్నూ మిన్నూ కానక మునులను, వారి పత్నులను, యాగాలను భంగంచేసి నానా చిత్రహింసలకు గురిచేశారు. ఆ కార్యక్రమంలోని భాగంగానే గాలవ ముని ఆశ్రమంలో యజ్ఞాల సామగ్రి అయినటువంటి యూపస్తంభాలను, సమిధలను, దండాలను చెల్లాచెదురు చేసి, మునుల కాళ్ళను పట్టుకొని అటు ఇటూ విదిలించివేసి ఆశ్రమాన్ని సర్వస్వం ధ్వంసం చేశారు. అప్పుడు గాలవముని ఇంద్రుని దగ్గర చెప్పుకున్నాడు. ఇంద్రుడేమి చేసేది లేక వారు వరబలోద్ధతులని చెప్పి, అగ్నిదేవుణ్ణి శివలోకానికి పంపాడు. ఆ సమయంలో శివపార్వతులు ఏకాంతంగా ఉన్నారని కవి సూచనప్రాయంగా మాత్రం చెప్పాడు.

........ ........ ........ ........

లోకమెల్ల తమడిగ నేలుకొనుచుండి
లలిత సౌగంధిక వనస్థలమ్ము పైన
విమల కార్తికజ్యోత్స్న వ్యాపించినట్లు
శ్రీ శివోత్తరుస్వామి దర్శించె వహ్ని

(చతుర్థ కమలం-15)

కార్తికజ్యోత్స్న (వెన్నెల)లో హాయిగా ఉన్న శివ పార్వతులను అగ్ని తొందరలో ఆలోచనారహితుడై దర్శించ డంతో వెన్నెల కలగబారి విరిగిందని కవి అభివర్ణించాడు - ఈ కింది పద్యంలో.

దొరల నవేళన్ కాన్పిం
తురొ? ఆలోచన నశించి తొందరగా తా
నరిగిన వహ్ని స్పర్శకు
విరిసెనుబో కలగబాఱి వెన్నెల తొగయున్.

(చ. క. 16.)

'అసమయంలో మమ్మలను దర్శించావు కనుక త్రిభువన (ముల్లోకాలు) భయంకరమైన రౌద్రతేజస్సు, నా మనోభావమయి నటివంటి ధాత్వంబువు భరింపు'మని శివుడు అగ్నియందు తన ధాత్వంబువును నిక్షిప్తం చేశాడు. అది తిట్టో, దీవనో తెలియదు. ఇక్కడ శివుని వీర్యము, రేతస్సులాంటి మాటలు వాడకుండా ధాత్వంబువు అని ప్రయోగించడం చక్కగా ఉంది. సౌమ్యంగా ఉంది.

ఆ శివ ధాత్వంబువును మోయలేక అగ్ని తలకిందు లయ్యాడు. తాళలేక "హరనర్తనం" (అక్కడి వృత్తం) చేశాడు. అగ్ని పడ్డ బాధను వర్ణించడానికి యుక్తమైన ఛందస్సు గతిని, అంటే హరనర్తనం అన్న వృత్తాన్నే ఎన్నుకొని వర్ణించడం సముచితంగానూ సందర్భోచితంగానూ ఉంది. ఇలాంటి విశేష ఛంధస్సుల నెన్నుకోవడంలో విశ్వనాథ సత్య నారాయణగారు ఘటికులు. తర్వాత వీరే అని చెప్పవచ్చు. ఈ కింది పద్యం చూడండి.

హరనర్తనం :

శైవతైజసధాతు వుజ్జ్వలియించెన్ సూక్ష్మమయూఖమై
పావకుండు నిమీలితాంబకుడున్ ధూతాభ్రము వోలె ఝం
ఝూవికంపిత సాధకాంచనదీపప్రోజ్జ్వల దేహుడై
తా వడిన్ భువి నొలిపోన్ తనువుంజొచ్చెన్ దహనాగ్నియై.

(చ. క. 18.)

శివతేజస్సు సూక్ష్మాతిసూక్ష్మ కిరణమై ఉజ్జ్వలించింది. పెద్ద సుడిగాలిలో మేడపై బంగారు కలశంలోని దీపం కొట్టు కుంటున్నట్లుగా అగ్ని దేహం సొలిపోజొచ్చింది. దహనాగ్నివలె ఇతని దేహంలో శివుని తేజము ప్రవేశించింది. ఆ దెబ్బకు తాళలేక అగ్నికి కనులు మూతపడుతున్నాయి. పై పద్యంలో ద్విత్వ జకారం (ఉజ్జ్వలియించెన్) యతి స్థానంలో ఉండటంవల్ల శివతేజస్సు యొక్క దహనతీవ్రత వ్యక్తమవుతుంది. అగ్ని మొదటనే అగ్గి. అలాంటివాడే శివతేజస్సు అనే అగ్నిని భరించ లేకపోయాడంటే ఆ శివతేజం ఎంత శక్తివంతమైందో తెలు స్తుంది. కనుకనే ఈ శక్తి భవిష్యత్తులో తారకాసురుని చంప డానికి యోగ్యత ఉందని పాఠకులు అర్థం చేసుకోగలరు.

అగ్నికి అడుగులు ముందుకు పడలేదు. అలాగే తూలి తూలి సోలిసోలి-తూలుతూ సోలుతూ బ్రహ్మ దగ్గరకు వచ్చి తాను పడుతున్న అవస్థను చెప్పుకోగా ఇద్దరూ కలిసి జాహ్నవి (గంగానది) దగ్గరకు వస్తారు. బ్రహ్మదేవుడు గంగమ్మను శైవ తేజ భారాన్ని మోయమని ఒప్పించడానికి ఈ విధంగా అంటాడు.

మహాక్కర :

చూడు గంగమ్మతల్లి! పాపము తన శోభ గోల్పోయినాడు
పరులకై
వీడె స్వాహాధవుండు గుర్తింతె? చెప్పినను దెలియనంత చెడినాడు
పీడబాప వేరెవ్వరు దిక్కు? నీవేయని పడుచు లేచుచు వచ్చితి
నీడ కేనేదొ పెద్దవాడేతెంచి యిట్లడుగు నటంచు దయచూడవే

(చ. క. 22)

ఎవరైనా చెప్తేకాని గుర్తుపట్టనంత ఈ అగ్ని మొహం ఇంతగా మాడిపోయింది చూడమ్మా! ఈతని కష్టం తీర్చడానికి నీవు తప్ప వేరే దిక్కులేదు. ఏదో పెద్దవాడు (బ్రహ్మ) ఇట్లడుగుతున్నాడని దయచూడమ్మా అని బ్రహ్మ గంగాదేవితో అంటాడు. గంగాదేవి ఎట్టి పరిస్థితులలోనూ తన చేతకాదు అన కుండా ఉండడానికి బ్రహ్మ వాక్పతిగా మాట్లాడినాడు. అగ్ని తన స్వార్థం కోసం కాదు ఈ బాధపడుతున్నది - పరులకోస మన్నాడు. స్వాహాధవుండు (స్వాహాదేవి భర్త - అగ్ని) అని కవి ప్రయోగించటంవల్ల ఏదో ఆడుపిల్ల మొహమైనా చూసి ఇతని కష్టం తీర్చాలని చెప్పినట్లయింది. పైగా పెద్దవాడైన బ్రహ్మ స్వయంగా వచ్చి అడగటంవల్ల పెద్దవాని మర్యాద అయినా కాపాడటం కోసం గంగాదేవి తిరస్కరించకూడదన్న భావన ఉంది. కవి ఈ సందర్భంలో పై మహాక్కర వృత్తాన్ని ఎన్నుకొన్నాడు గొప్ప అవసరం కలిగింది కనుక ఇక్కడ మహాక్కర వృత్తంలో రాయడం సందర్భానుగుణంగా ఉంది. పైగా తెలుగువాడు మాట్లాడే ధోరణికది చక్కని వాహికగా ఉపయోగపడింది.

ఇక బ్రహ్మ చెప్పిన తర్వాత గంగాదేవి ఎట్లా కాదంటుంది? 'సరియె' అన్నది. అన్నదో లేదో 'అనుటయేసరి స్రవించి - రౌద్రతేజస్సు నగ్ని బిరాన చనియె' (చ. క. 24). రౌద్రరీణమైన తేజస్సును గంగానదిలో వదిలిపెట్టి అగ్ని వెను

దిరిగి చూడకుండా బిరాన వెళ్ళిపోతాడు. అక్కడ చాలాసేపు ఉంటే ఆ తేజస్సును గంగానది మోయలేక తిరిగి నాకే అప్ప చెప్పుతుందేమో అన్న భయం ఉంది కాబోలు పాపం - అగ్ని దేవునికి.

ఇక గంగాదేవి పడ్డ అవస్థ చూడండి.

అడుగున బ్రొయ్యి మండగ-తదగ్నికి కుండికలోని నీరముల్
ఉడుకుచు తెర్లుచున్ పొగల మగ్రముగా పెనుచుట్లు కట్టుచున్
బుడబుడమంచు చప్పుడుల పొర్లెడు తీరుగ శైత్యమూర్తి తా
కడు సుడి చుట్టుకొంచు మెలికల్ తిరిగెన్ గను నాకు భీతిగా
(చ. క. 25)

గంగానది ప్రవాహంలో రౌద్రరేణం ఎప్పుడైతే పడిందో వెంటనే అడుగున బాగా తీవ్రంగా మండుతున్న పొయ్యిమీద ఉన్న కుండలోని నీళ్ళు కుతకుత ఉడుకుతూ బుడబుడమనే చప్పుళ్ళతో పొంగిపొర్లుతూ, తెర్లుతూ ఉన్నట్లుగా గంగానదీ ప్రవాహం కూడా అదేవిధంగా సుడికట్టుకొని మెలికలు తిరుగుతూ చూసేవాళ్ళకే భయంగా ముందుకు సాగిపోయింది.

తరువాత గంగానదీ ప్రవాహం విషమావస్థకు గురి అయింది. ఆ అవస్థను వర్ణించడానికి కవి ఇక్కడ విషమగీతులైన ఎత్తుగీతి, కమలన గీతులలో వర్ణించాడు. వ్యాస విస్తరణ భీతితో అవన్నీ ఇక్కడ చెప్పటంలేదు.

అంత బాధపడ్డప్పటికీ గంగాదేవి బ్రహ్మను పల్లెత్తి మాట అనలేదు. చూసేవాళ్ళకే కడుపు తరుక్కుపోయేటట్లుగా ఉంది - ఆమె అవస్థ. తన బాధ తనలోనే పడింది కాని ఈ అవస్థకు కారణభూతుడైన తనను ఒక్క మాటకూడా అనలేదని బ్రహ్మదేవుడు ఈ కింది పద్యాలలో చెప్తాడు.

మంజరీ ద్విపద :

కలుగు బాధలనెల్ల కుడుపులో దాచి
గంభీర ముద్రతో కదిలిపోవుచును
ఘన తుషారచ్ఛన్న కంజమైయుండ
చూచువారల కడుపు చుమ్మచుట్టెడిని
తన బాధ తనయంద దాచ్చెనేగాని
నోర్విప్పియనెనె? నన్ను నొకింత మాట
కలుషౌఘ పావని గంగా భవాని
ఆ తల్లి నడవడి అఖిలమ్మొరవడి (చ.క. 28)

తారకాసురుడు ముల్లోకాలను పెట్టిన గొప్పదైన బాధకంటే మూడింతలు ఎక్కువగా బాధపడ్డది గంగాదేవి-'శివ నిర్భర వీర్య పటుత్వదాహ ధారణమున తల్లి వడ్డది చిరమ్ము జగమ్ము హితమ్ము కోసమె' (చ. క. 29) ఇక్కడ మకారం ముమ్మారు ఆవృత్తమైనందువల్ల గంగానది పడ్డ కష్టం ఎంతటిదో పాఠకుడు అర్థం చేసుకోవాలి.

చాలాకాలం శివుని మహావీర్యాగ్నిని మోసుకుంటూ వెళ్ళి గంగానదీ దేవత కాశవనం (రెల్లుతోట)లో విడిచిపెట్టింది. ఆ కాశవనంలో పరమాద్భుతమైనటువంటి శైవకాంతి గడ్డకట్టి (అంటే జైగోట్-సంయుక్తబీజం ఏర్పడిందన్నమాట) అత్యంత దివ్యమైన తేజస్సు కలిగి శిశువై పుట్టినాడు కుమారస్వామి. చంద్రుడు, సూర్యుడు, అగ్ని - వీరి ముగ్గురి తేజస్సులు కలిసిన శక్తినే సోముడు (సా+ఉమ) అంటారు. ఈ తేజాన్నే 'బంగారు కాశ (స్వర్ణకాశ) మంటారు. దీనికే వృథు గర్భమని పేరు.

త్రిగుణమూర్తి, గంగ దినమణి చంద్రాగ్ని
వపుష, చంద్రు డగ్ని బ్రధ్నుడనగ
సోముడతని తేజమే మఱి బంగరు
కాశ మందురు పృథుగర్భ మదియె. (చ. క. 39)

కవి ఇక్కడ సోముడు (స+ఉమ=ఉమాసహితుడు) అన్న ప్రయోగం చేసినందువల్ల పార్వతి తేజస్సు కూడా అందులో ఉందని అర్థం. ఈ వృథుగర్భాన్నే మహాయోని అని తంత్రం చెప్తోంది. అదితి అని, ఋతమని, వేదాలు పక్కాణిస్తున్నాయి. దేవి అని పురాణాలు; మూలప్రకృతి అని సాంఖ్యం దీన్నే వర్ణిస్తున్నాయి (కుమార భారతి - పు. 45). కనుకనే కుమార స్వామి కాశవనంలో ఉద్భవించడం. ఇంత మహత్తరంగా శక్తిమంతంగా పుట్టినవాడు కనుకనే పుట్టిన మూడు దినాలకే క్రౌంచ పర్వతానికి శివధనుస్సు చేతబట్టుకొని రంధ్రం చెయ్య గలిగాడు అని కవి ఈ కావ్యంలో ప్రత్యక్షంగా చెప్పకుండా పరోక్షంగా సూచించి వదిలేశాడు. ఇంత మర్మగర్భితమైన కవిత్వముంది కనుకనే విశ్వనాథవారు ఈ కావ్యాన్ని ప్రౌఢకావ్య మనక తప్పటం లేదన్నారు (ప్రౌఢకావ్య మనటానికి నిఘంటువుల కతీతంగా ఉన్నటువంటి పదాలు, పదబంధకల్పనలు, ప్రకృష్ట మైన భాష, అందమైన సమాసాలు, ఉచిత పదజాలం మొద లైన వాటితోపాటు వేదాంతసార మర్మగర్భితమైన కవిత్వ ముండడం కూడా ఒక కారణం).

కుమారస్వామి క్రౌంచ పర్వతానికి, శివధనుస్సుచేత రంధ్రం చేసిన శబ్దానికి ఇంద్రుడు భయపడి సప్తమాతృకలను వేడుకొని భయంకరమైన ధ్వనికి కారణమెవ్వరో కనుక్కు రావ

డానికి పంపిస్తాడు. వారు మాట్లాడుకుంటూవచ్చి హిమవత్పర్వత ప్రాంతంలో సమావేశమౌతారు.

ఆ శబ్దం వచ్చినచోటు ఎక్కడ ఉండవచ్చునని ఆలోచిస్తున్న సమయంలో - తెల్లతామర పూలతోను, మకుట దళాలతోను (కేసరాలను చుట్టిఉండేపూరేకు) కదలి దూకుతున్నట్టి గంగ (గంగానది) కృత్తికల పాదాలకు అర్ఘ్యము లొసగింది. సహజంగానే గంగా ప్రవాహంలో తామరపూలు, ఆకులు మొదలైనవి కలిసి ఉంటాయి. దాన్నే కవి వక్రీకరించి చెప్పారు. ఈ భావాన్ని కింది పద్యంలో గమనించవచ్చు.

హరు జటాజూటమున సుధాకర శకలము
పుండరీక సంవర్తికముం బొనర్చి
అల్లలాడించి దుమికినయట్టి గంగ
అలరి భగినుల కర్ఘ్యపాదము లొసంగ
(తృతీయ కమలం-32)

ఆ కృత్తికామ తల్లులు గంగానదిని చూశారు. అప్పుడు ఆ గంగాదేవి బాలెంతరాలుగా ఉన్నది. ఆ బాలెంతరాల వర్ణన చాలా అందంగా సహజమైన పద్ధతిలో ఉంది. అది చూడండి.

శ్రీ సితవారికాంతుల కృశించిన మేనును-పుల్లకైరవో
ద్భాసిత వక్త్రమండలము-పంకజపాంసు నిశావిలిప్తమై
భాసిల తెల్లవాలుగల స్వచ్ఛవిలోచనముల్ చలింప గం
గాసతి అద్దు క్రీ గడుపునన్ గల చారలు చూచి నవ్వుచున్
(తృ. క. 33)

ఇక్కడ కృశించిన మేను అంటే కాన్పు తర్వాత బాలెంత చిక్కిపోతుంది. మొహం తెల్లకలువలు ప్రకాశించినట్లుగా (పుల్లకైరవోద్భాసిత వక్త్రమండలము) ఉన్నది. అనగా బాలెంత మొహం తెల్లబడటం సహజం. అలాగే కన్నులు కూడా (తెల్లవాలుగల స్వచ్ఛ విలోచనముల్) తెల్లగా ఉన్నాయి. కన్నులు పాలిపోయినట్లుగా బాలింతకు ఉండడం మనం చూస్తుంటాము. కాన్పు తర్వాత అంటే బిడ్డ కలిగిన తర్వాత పొత్తికడుపు (క్రీగడుపు)పై ముడతలు చారలలాగా బాలింతకు చాలాకాలం ఉంటాయి. ఈ విషయాన్ని కవిగారు 'గంగాసతి అద్దు క్రీగడుపునన్ గల చారలు' అని చక్కగా ఛందోబద్ధం చేశారు. ఇలా ఒక మానవ స్త్రీకి ఏ విధంగా అయితే బాలింత లక్షణాలు ఉంటాయో ఆ లక్షణాన్ని గంగాదేవిపై కవి ఆరోపించాడు. ఇక గంగానదిని జడపదార్థంగా తీసుకున్నా కూడా అర్థం సహజంగానే ఉంది. 'పంకజపాంసు నిశావిలిప్తమై' అన్నందువల్ల పసుపుపచ్చని పూలు (పంకజ = తామరపూలు, నిశా = పసుపు) పసిమి వన్నెగల పూలు (పాంసు = పుప్పొడి, రజం, ధూళి), వాటి పుప్పొడిచేత గంగాజలం కప్పబడి (విలిప్తమై = కప్పబడి) ఉండడంచేత నదీప్రవాహం అడుగున చారలలాగా కనిపిస్తాయి. అంతేకాక నది అడుగున ఇసుకపొర మీద ఉండే చారలూ చూడదగ్గవే. పసుపు పుప్పొడి అన్నందువల్ల బాలింతలకు శరీరాన్నంతా పసుపుతో పూస్తారు. దీన్ని పసుపు పుప్పొడి, పూలచేత కప్పబడినట్లు వర్ణించడంద్వారా కవి బాలింత లక్షణాన్ని గంగానదిపై ఆరోపించారు ఇది ఒక చక్కని భావన. భావించగల హృదయమున్న వారెవ్వరూ ఈ పద్యంలోని అందాన్ని, తియ్యదనాన్ని ఆస్వాదించకపోరు

ఆ విధమైన గంగాదేవిని చూసి ఇక్కడెవ్వరో 'బెట్టదపు మ్రోత కావించెనంట' నీకేమైనా తెలుసునా అని అడుగుతారు. ఆమె ఉత్తరదిక్కును చూపిస్తుంది. వారందరూ గంగతో కలిసి 'ప్రమోదతరంగ సంగతోజ్జ్వల జలజాత చిత్తలయి వాహన యుక్తలయి' ముందుకు సాగిపోయినారు. కొంతదూరం పోయిన తరువాత గంగాదేవి కృత్తికలను ఆగమన్నది. అప్పుడు వారందరూ గంగ ప్రక్కకు చలించే దిక్కుకు చూశారు. అప్పుడే వారికి 'మహోజ్వల మంజుల శుభ్రకీర్తి చంద్రికవలె ఉన్న ఒక ప్రతిలేని వీరుని' (తృ. క. 37) కుమారస్వామిని చూశారు. ఈ సందర్భంగా గంగాదేవి కుమారస్వామి ఉన్నవైపు చేతితో చూపినట్టుగా కాకుండా గంగానది కుమారస్వామి ఉన్నవైపు ఒక చిన్న పాయగా ముందుకు కదలగా సప్తమాతృకలు చూశారని (గంగ అంగుళి చలించెడు దిక్కుగ చూచిరందఱున్— తృ. క. 36) చెప్పడంతో కవికి ప్రకృతిపట్ల ఉన్న గౌరవం, మమకారం, ఆరాధన మనకు సుబోధకమవుతుంది.

'శివభవ్యతేజమ్ము భద్రమైన చిఱుత రూపము దాల్చినదో' (తృ. క. 41) అన్నట్లుగా ఉన్న బాలుని చూసి ఆ మహోగ్రరవాన్ని కలుగజేసినవాడు ఇతడా అని ఆశ్చర్యపడ్డారు సప్తమాతృకలు. ప్రక్కనే శివధనుస్సు కరములు మోడ్చి ఉంది.

వారికి ఆ శిశువుని చూసిన తర్వాత భయం పోయింది. తన కడకు వచ్చే మాతృసప్తకాన్ని గాంచి ఆ కుమార శిశువు ఎదురురాగా ఎత్తికొని ముద్దాడి చలిదాకునేమోయని ఆ తల్లులు ఆప్యాయంగా పయ్యెదలు కప్పారు. (తృ. క. 47).

అఖిల లోకాలకు తల్లి అయిన గంగామూర్తిలోని చిఱు భాగములమే మేము కాబట్టి మాకు కూడా నీవు, బంగారుబిడ్డవౌతావు' (తృ. క. 49) అని వారు కుమారస్వామితో అంటారు.

'నీ జననం కోసం దేవతలందరూ ఎదురుచూస్తున్నారు. దేవేంద్రునిపై నీవెప్పుడూ దండెత్తవద్దు. అతడు నీకడకు వస్తే పరీక్షణ చేస్తానని మాకు మాటీయమని (కృ. క. 51-52) కృత్తిక లడుగగా అలాగే చేస్తానని కుమారస్వామి అంటాడు. ఎప్పుడైతే ఆ మాట అన్నాడో స్వామి శ్రవణాంతములందు ఏవో దైన్యరావములు వచ్చి తాకడమూ; కృత్తికలు ఆరుగురై కనులముందు ఒకేసారే స్వామికి కనబడటం (కృ. క. 53) జరిగింది.

శిశువైనటువంటి కుమారస్వామి తల్లులతో ఈ విధంగా అంటున్నాడు.

"వీరలు సప్తమాతృకలు-వీరలు కృత్తిక లార్వురిట్టులం
బా రమణీయమూర్తులు, కుమారుని కోసము వచ్చి చిట్టెడే
క్షీరము నిచ్చినారలె-కృశించెను చూడుడు పొట్ట, సూర్యుడున్
చేరెడు రాకముందటె, జనించితి నిన్నటి ప్రొద్దునెప్పుడో"

(కృ. క. 57).

"కుమారుని కోసం వచ్చి చిట్టెడైనా పాలనిచ్చారా? ఎలా కృశించిందో చూడండి పొట్ట. నిన్నటి ప్రొద్దున సూర్యుడు పుట్టక మునుపు ఎప్పుడు పుట్టినానో!" అన్న కుమారస్వామి బుడిబుడి ఏడ్పుల పలుకులు విన్న కృత్తికలు చేపులు పట్టరాక ఆరుగురు ఒకేసారి చేతులుచాపి కుమారా (కృ. క. 58) అని పిలుస్తారు.

ఓహో వీరల కేడ్పు పొంగడగి తాముప్పొంగు వాత్సల్యమున్
బాహుల్ సాచుచు వచ్చుచుండిరిటులన్ పాలీయనంచెంచి తా
నాహా పుట్టి సమస్తలోకములు తామాశ్చర్య పాథోధి వీ
చీ హేరాళ నిమగ్నమై చన, శిశువ్యాపార పారీణుడై
ఈహన్ క్షీరము త్రావె ఆర్మొగములై ఏపారు యావమ్మనన్

(కృ. క. 59)

ఓహో! తాము ఉప్పొంగే వాత్సల్యాన్ని పట్టలేక చేతులు చాపుకుంటూ పాలివ్వడానికి వస్తున్నారని స్వామి ఊహించి సమస్తలోకాలు ఆశ్చర్యపడేటట్లుగా తాను ఒకేసారి ఆరుముఖాలు దాల్చి ఆ ఆరుగురు తల్లుల క్షీరాన్ని ఒకేసారి శిశు వ్యాపారపరమైన చేష్టలుచేస్తూ ఇష్టపూర్వకంగా త్రాగాడు. ఇక్కడ 'శిశు వ్యాపార పారీణుడై' అని కవి అందమైన పదబంధాలను వాడటం వల్ల పుట్టిన బిడ్డ లేదా నెలరోజుల బిడ్డ (మన రెక్కలో) చేసే చేష్టలు, అమాయకపు చూపులు, నిష్కల్మషపు బుద్ధి మొదలైనవన్నీ పాఠకులకు తలపునకు వస్తాయి. ఈ విధంగా కృత్తికల క్షీరాన్ని త్రావి స్వామి కార్తికేయుడైనాడు. (కృత్తికల కుమారుడు అని అర్థం) ఈ వర్ణనమంతా వత్సలభక్తి లేదా వాత్సల్య రసోదాహరణంగా తీసుకొని పరామర్శించాలి. తెనాలి రామకృష్ణుడు - విశ్వనాథవారి రచనల్లో మనకలాంటి ఘట్టాలు తారసపడతాయి.

ఇటువంటి శిశువయస్సులో ఉన్న కుమారస్వామి ముందుకు సైన్యసహితంగా ఇంద్రుడు వచ్చాడు. బ్రహ్మ ఇంద్రునితో "క్రౌంచపర్వతాన్ని తొలచిన శబ్దాన్ని విని ఎవరో శత్రువని నీవు మహాసైన్యంతో కసిగా వచ్చావు. దిక్కుల జిరా తొండాల నెత్తుకొని ఘీంకారంతో పరిగెత్తునట్లుగా శివధనుస్సును పట్టి పెనవెట్టి ఆవల వేశాడు - పుట్టి ఇంకా మూడు దినములు కూడా కాని ఈ కుమారుడు" (చ. క. 7) అని అన్నాడు.

వ్యాసం ముగించేముందు ఇంకో విషయం. ఇంద్రుడు వజ్రాయుధాన్ని దూసుకొంటూ వచ్చాడని ఇంతకుముందు చెప్పుకున్నాం. ఆ వజ్రాయుధపు తాకిడికి కుమారస్వామి శరీరం నుంచి విశాఖుడు పుట్టాడు. ఈ విషయం ఈ సందర్భంలో చెప్పకుండా పంచమ కమలంలో విశాఖ రాయబార ఘట్టంలో విశాఖుని చేతనే చెప్పించడం ద్వారా పునరుక్తం కాకుండా కవి జాగ్రత్తపడ్డారు.

మధ్యాక్కరలు :

రాయబారిగ వచ్చినాడ రాక్షసాధిప! దేవసైన్య
నాయకు నిశితాజ్ఞ చేత నను విశాఖుండందు రెల్ల
ప్రకృతి ఛందోగమనమ్మె రమణీయ ధర్మమంటంద్రు
సుకవులు మునులు తద్ధర్మ సుందరగమనరక్షకమ
చికిత వజ్రమ్మె తత్క్రోధసంహతి స్కందుని మేను
నకు తాక పుట్టితి స్కందునకు నాకు భేదమ్మె లేదు.

(పం. క. 10, 11)

విశాఖుడు స్కందుని (కుమారస్వామి) శరీరంనుండి పుట్టినవాడు కావటంవల్ల కుమారస్వామికి, విశాఖునికి అభేదం చెప్పబడింది. మనం ఎప్పుడైతే కుమారస్వామి జన్మగురించి చెప్పుకుంటామో అప్పుడు విశాఖుని పుట్టుక చెప్పకపోతే కుమారస్వామి జన్మపూర్తి అయినట్లు కాదు. ఇంద్రుడు వజ్రాయుధాన్ని నాశనం కావాలని వేస్తే దానికి బదులు కుమారస్వామి తనలాంటివాడిని ఇంకొకడిని సృష్టించుకోవడం ఇక్కడ గమనించదగ్గది.

ఈ విధంగా ఈ కావ్యం మొత్తం ప్రతి పద్యాన్ని కూడా చాలా చక్కగా అందంగా నడుపుతూ కావ్యాన్ని నిర్మించారు ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావుగారు.

# ప్రవాహం

## శ్రీ దిలావర్

నగ్నంగా అనాగరికంగా ఆదిమంగా
ఏ యుగాల సృష్టి జటాజూటంలోనో ఉద్భవించి
ప్రవాహ పరిణామశీలాన్ని గర్భీకరించుకొని
గణతంత్రాల చిరుకెరటాల
లేతచేతులు చాపుకుంటూ
పరిమిత సైకతాలలో
దృష్టాదృష్ట భవిష్యచ్చంద్రికా రవధూళిలో
పసితనపు అజ్ఞానాటువుల్లోంచి కేరింతలు కొడుతూ
పడుతూ లేస్తూ
పడుచుదనంలోకి ఉరకలు వేస్తూ
ప్రతి పోకిరీ గులకరాయి వెచ్చని స్పర్శకు నిలువునా
చీలిపోతూ
ప్రతిగా-పయ్యెదమీద పాయల పైట సవరిస్తూ
చీకటి కూకటుల-
మెరిసే కాంతిచ్ఛటుల-
ప్రకృతి సయ్యాటలకు ప్రణమిల్లుతూ
సంకుచిత వైయక్తిక ఝరీ సంగీతాని కతీతంగా
సమష్టి ఉద్యమ చారిత్రకోర్మికల సంపుటంగా నినదిస్తూ
పాయలు పాయలుగా
మేధోవీచికల ధ్వనిస్తూ
సంప్రదాయపు వాలువెంట పరుగులు తీస్తూ
మానవతా తీరాలవెంట ప్రయాణిస్తూ
త్రివిక్రమత్వంతో పరాక్రమిస్తూ
త్రికాలాలలో పరిక్రమిస్తూ
అశాంతి బడబానలం
దాచుకుంటూ
అతివాద హాలాహల రూపం
దాల్చుకుంటూ
ప్రళయ భీకర మహోద్ధుతోత్తుంగ తరంగిణిగా
యుద్ధోద్ధూత శోణిత సంచలిత కల్లోలినిగా
అనంతరూపాలతో
ఆనందలాస్యాల శక్రచాపాలతో
అభిసారికగా నిరీక్షిస్తూ
నూతనావిష్కరణల నన్వేషిస్తూ
ప్రశాంత దరహాస ఫేన శకలాలు విరజిమ్ముకుంటూ
నాగరికతా ముక్తాఫలాలు పండించుకుంటూ
వేదవచనంలా ఘోషిల్లుతూ
శాంతిప్రవచనంలా ఘూర్ణిల్లుతూ
అసత్తునుండి సత్తుకు
తమస్సునుండి తేజస్సుకు
మృత్యువునుండి అమరత్వానికి
ప్రస్థానిస్తున్నది ప్రవాహం!

ఆచార్య జాస్తి సూర్యనారాయణ

# ప్రీ హిందీ - తెలుగు

హిందీ మొదలయిన ఉత్తర దేశభాషలకున్న చరిత్ర గత మూడు లేదా నాలుగు శతాబ్దాలకు పరిమితం. మరాఠీ మాత్రం ఈ సామాన్యం శానికపవాదు అని అంటారు. అయినా వెనుకటి మరాఠీ (16వ శతాబ్దానికి పూర్వం) ప్రాకృత భాషామయం.

ద్రావిడ భాషలకన్న చాల తక్కువ కాలపరిమితికి చెందినవి ఈనాటి ఉత్తర భారత భాషలనటం నిస్సంశయం. ద్రావిడ భాషలు దక్షిణ దేశమునందు రూపుదాల్చి వాఙ్మయం రచితమవుతుండటం మిక్కిలి ప్రాచీనము. క్రీస్తుశకం పదో శతాబ్దానికి కొంత ముందుగా కన్నడం కొద్దిగ తరువాత తెలుగు వాఙ్మయ రూపం దాల్చినట్లు గ్రంథములు లభ్యము లగుచున్నందున నిష్కర్షగ చెప్పగలుగుతున్నాము. తమిళ వాఙ్మయాన్ని గూర్చిన వివరాలంతగా లభింపకున్నా ఇది చాల ప్రాచీనమని క్రీస్తుకు పూర్వమని ఆ పండితులు వాదము చేయటం గద్దు. మలయాళం వాఙ్మయరూపం దాల్చటం మిక్కిలి ఆధునికం.

16వ శతాబ్దికి మునుపు ఉత్తరదేశంలో ఏ భాషలున్నాయనేది ప్రశ్న. ఆధునిక భారతీయ భాషలకు మునుపు (ఉత్తరాదిలో) ప్రాకృత భాషలున్నవి. క్రీస్తుపూర్వం 5వ శతాబ్దినుంచి క్రీస్తు తరువాత 11 లేదా 12 శతాబ్దివరకు ఉత్తర భారతంలో ప్రాకృతభాషలు వ్యవహారంలో రూఢిగాంచి ఉన్నవి. అంతకుమునుపునుంచి నేటివరకు ఉత్తర దేశాల్లోనేగాక అన్ని ప్రాంతములందలి విద్యావంతులకు మాధ్యమంగా సంస్కృతం ఉంది. ఇందులో రెండు విభాగాలున్నాయి. వైదిక లౌకిక భేదాలవి. లౌకిక సంస్కృతం పాణిన్యాది వ్యాకరణ ప్రతిపాదితము. వేదములందలి సంస్కృతం వైదికము. కర్ణ శబ్ద మకారాంతమయినందున పాణిని వ్యాకరణం ప్రకారం అకారాంతములకు తృతీయా బహువచనంలో హలంతముల విషయంలో వచ్చే భిఃఐః (అతో భిస్, ఐస్ (7-1.9)గ మారుతుంది. వైదిక సంస్కృతంలో అకారాంతములపైన గూడ భిః వాడినారు. అందువల్ల కర్ణేభిః అనేది ఆర్షప్రయోగం. లౌకికభాషలో ఇది కర్ణైః అని ఉంటుంది. పాణిని వ్యాకరణం ఎంత విశదంగా శబ్దరూప నిష్పత్తిని వివరించినా కొన్ని కొన్ని రూపాల విషయంలో మహాపండితులకే సందేహం గలుగుతుండేది. యజ్ఞంలో హోత దధి శబ్దమునకు తృతీయైక వచనం ధద్యా్న అని దధినా అనో తెలియక దధి శబ్దమునకు తృతీయా ఏకవచన రూపం ఏదో దాంతో (దధిశబ్దస్యయత్తు తృతీయాంతం తేనజు హోతి) అని ప్రయోగించినట్లు చెప్పడం గలదు. ఇంక వివిధములైన ప్రాకృతాల కనేకాలయిన వ్యాకరణాలు నిర్మితాలయినాయి. హిందీ మొదలయిన ఆధునిక భారతీయ భాషలకు వ్యాకరణాలనేకం వెలువడినాయి. వ్యాకరణాలవల్ల ఆనాటి భాషకు గల స్వరూపం మనము గ్రహించగలుగుతున్నా నిఘంటువులు గూడ ఈ యంశంలో తోడ్పడుతాయి. సంస్కృతానికి అసంఖ్యాకంగా నిఘంటువులున్నాయి. ఈ విషయంలో ప్రాకృతం కొంత వెనుకబడినట్లు చెప్పుకోవాలి ఆధునిక భాషలకు చెప్పుకోదగిన నిఘంటువులున్నాయి.

ఆధునిక భారతీయ భాషలగు హిందీ మొదలయిన భాషలు రూపుదాల్చకమునుపు ప్రాకృత భాష లుత్తర భారతంలో వ్యవహార దూరములయినప్పుడు అనగా ప్రాకృతములయనంతరము (పోస్ట్ ప్రాక్రిత్) హిందీకి ముందు (ప్రీ హిందీ) 4, 5 శతాబ్దాల కాలవ్యవధి ఉండి. ఈ కాలంలో ఉత్తరదేశంలో గల భాష ప్రాకృతములకు మిన్నగా హిందీ మొదలయిన ఆధునిక భాషలకు పూర్వరంగము లేదా భూమికగా ఉండి ఉంటుంది.

ఔత్తరాహుల భాష :

ఈ కాలంలో ఉత్తరభారత దేశీయుల వ్యవహారంలో గల భాషకు లిఖితరూపంలో ప్రతీకలు కొద్దిగా గనిపిస్తున్నాయి. అందులో విద్యాపతి అనే ఆయన (1400) రాసిన పాటలు కొన్ని మనకు దొరుకుతున్నాయి. నాటినుంచి నేటివరకు (14-19) మౌఖిక ధోరణిలో ఉన్నందున ఈ పాటలలో కాల వ్యక్తి దేశ విధేయములయిన మార్పులెన్నో చోటుచేసుకొని యుండును.

అందువల్ల వీటిని ప్రమాణముగ గ్రహించటంగానీ ఇవి మా నాటి భాషకు మచ్చులనిగాని గ్రహింప వీలుగాదు. పృధ్వీరాజరాసో, అనే వీరకావ్యం గూడ కాలక్రమమున మార్పులకు చేర్పులకు గురయినందున దాన్ని ఆ కాలమునందలి భాషకు ప్రతీకగ గుర్తించటం సరిగాదు. 1540 హర్షారాజ్య కాలమునందు మాలిక్ మహమ్మద్ అనే యతీశ్వరుడు రచించిన పదుమావతి యొక్క మూలప్రతి నేడు మనకు లభించినది. ఇందు మార్పులు చేర్పులు లేనందున దీన్ని ఆనాటి భాషకు ప్రతీకగ గుర్తింపనగును. 1898లో దీన్ని ఆసియాటిక్ సొసైటీ అఫ్ బెంగాల్‌వారు ప్రకటించారు. దీనికి జి. ఎ. గ్రియర్సన్ సువిపులమైన పీఠిక రాశారు. ఈ మహాకావ్యము నందలి భాష ప్రాకృతలక్షణమును గలిగియుంది. ఈ లక్షణములు కొన్ని నేటి హిందీ భాషలలో నిలిచియున్నవి. ఈ గ్రంథమునందు సంస్కృత ప్రాకృత పండితులకు అశ్రుతపూర్వములయిన పదము లనేకం ఉన్నవి. వానికి హిందీలో వివరణనిస్తూ ఈ అమూల్యమయిన ప్రతిని నూరు సంవత్సరముల వెనుక ప్రచురించిరి. ఇందు ప్రయుక్తము లయిన కొన్ని పదము లీనాటి తెలుగులో ప్రయుక్తములగు చున్నవి. ఈ సామ్యమునకు ప్రాకృత ప్రభావము మూలమని గ్రహింపవచ్చునుగాని ఇందు కొన్ని కొన్ని సంస్కృత పదములు ప్రాకృత రూపమును పొందుటలో తెలుగు మొదలయిన దేశీయుల భాషను ప్రభావితము గావించిన ప్రాకృతమునకు భిన్నముగ నుండుట గమనింపనగును.

ప్రాకృతముల వైవిధ్యము :

ఇంతేగాక కొన్ని పదాంశములీ భాషలకు నేటి తెలుగుకు తుల్యముగ నుండుట ముఖ్యముగ గమనింపదగిన యంశము. అగ్గి అనేది తెలుగులో ఉంది. ఇది ప్రాకృత పదమైన అగ్గీ అనేదానినుంచి వచ్చినట్లు బాలవ్యాకరణము. సంస్కృతంలో అగ్ని అని వాడగా ప్రాకృతం అగ్గీ అయినందున తెలుగులో అగ్గి అయిందని సూరి తలంపు. పదుమావతిలో అగ్గి = ఆగీగా మారుతుంది. దాన్నినుంచి ఆగ్ అని దేశీయ భాషలో ఏర్పడిన దని వివరించారు. (పుట. 324). సంస్కృతంలో సంయోగం గల సందర్భాల్లో సమీకరణం వచ్చిన రూపం తెలుగు మొద లయిన ద్రావిడభాషల్లో గలవు. రత్న-సమీకరణ రత్త (తెలుగు) రన్న (కన్నడం) పదుమావతి (పుట. 156)లో రతన అని గలదు. ఇష్టస్య రాగమం (సంయోగస్యేష్ట స్వరాగమో మధ్యే) చందుని ప్రాకృత వ్యాకరణసూత్ర విధేయంగా వచ్చినట్లు గ్రహింపనగును. ఇష్టన రాగమం వచ్చిన రూపాలందు ఈ క్రింది విధముగ గమనింపనగును. దృష్టి > దిసటి (8) మిత్ర > మితర, (8) శత్రు > సతుర్రు (8, 89) దృష్టివంత > దిసిటివంత (11) త్యాగ > తిఆగీ (23) దేశాంతర > దిసంతర్ (23) ద్రౌపది > దురుపది (66) వ్యాధి > అ ఆధి (66) రత్న > రతన (156) మొదలయిన రూపాలు పదుమావతిలో ఉన్నాయి. రత్నలో సమీకరణంవల్ల (రత్త తెలుగు) రన్న (కన్నడం) ఇత్యాదిగ ఏర్పడుతాయి. ఇలా సమీకరణం వచ్చిన రూపాలు కొన్ని పదుమావతిలో లేకపోలేదు. యజ్ఞ > జగ్గ (23) పుణ్య (పున్న) మొదలైన ప్రయోగాలను గుర్తింపనగును.

పదతౌల్యత :

వేగ అనే సంస్కృతంనుంచి ఏర్పడిన బేగి అనే శబ్దాన్ని పదుమావతి కర్త అయిన మాలిక్ మహమ్మద్ తరచుగ వాడాడు. ఈ మాట ఈ యర్థంలోనే తెలుగు వ్యవహారంలో నేటికీ ప్రయుక్తమవుతుంది. ఆజ్ఞా అనే సంస్కృత శబ్దం 'ఆన'గా మాలిక్ మహమ్మదు భాషలో ప్రయుక్తము. (పుట. 4.1). ఈ ఆన, ఈ యర్థంలో తెలుగు వ్యవహారంలో ఉంది. ప్రాంసరీ నోటు ప్రారంభం 'ఆనతో గావటం తెలుగులో పరిపాటి. ఘట మనే పదం ఈ భాషలో శరీరం అనే అర్థంలో గలదు. ఈ పదాని కీయర్థం సంస్కృతంలో లేదు. తెలుగు వ్యవహారికంలో ఘటమీ యర్థంలో ప్రయుక్త గావటం గుర్తింపదగిన యంశము. "ఈ ఘటం ఎలా తెల్లారుతుందో, మొదలైన గ్రామీణుల ప్రయోగాలలో గల ఘటము శరీరార్థకమని" నిష్కర్ష చెప్ప వచ్చును. నవల అనే దీతని భాషలో క్రొత్తది నూతనము (పుట 100) అనే అర్థంలో ప్రయుక్తమయి ఉంది. తెలుగులోకి క్రొత్తగ వచ్చిన సాహిత్య ప్రక్రియ అయిన ఆఖ్యాయికకు బదులుగ మన నవల పదాన్ని వాడుతున్నాం. దీన్ని ఆంగ్ల పద మయిన నావెల్ నుంచి వచ్చినదనుకున్నాం. కాని నూత్నమనే అర్థంగల నవల పదమే ఇదని గుర్తించటంతో అసామంజస్యం ఉండదనుకుంటాను

ప్రాకృత భాషల్లో ఒక భేదము 'పాళి'. ఈ పదానికి గ్రంథంలో ప్రాంతము తటమని యర్థాలున్నాయి. (పుట. 96, 109) కావున ఈ భాష సముద్ర తీరప్రాంతమువారు వ్యవహరించు భాషయని తలంచటం సమంజసముగ ఉంటుందేమో పరిశీలించి తేల్చవలసిన యంశము.

నట, (పుట 416) పదం ఈ భాషలో తమాషా చూచే వాడనే యర్థంలో ప్రయుక్తం. నటన, కృత్రిమము అసహజమనే యర్థంలో సంస్కృతాంధ్రములందు గలదు.

మానసర (పుట 342) మానస సరస అనే సకారాంత పద్యయములకు సమానము ఈ కవి భాషలో రెండు పదముల యంతమునందు గల సకారములు లోపించుట గలదు. సరవర (225) అనే ప్రయోగంలో గూడ సరస)లోని తుది సకార లోపము గుర్తింపదగియున్నది.

'ఇనీ' స్త్రీలింగంలో :

'ఇనీ అనేది స్త్రీ ప్రత్యయముగ వాడుక చేయుట ఈ కాలమునందే గలదు. కూరంగనీ (పుట 214)

నటనీ (పుట 416) తమోనినీ (పుట 416)
ఢోమినీ (పుట 416) డోమినీ (పుట 416)
సహనాయినీ (పుట 416) గోపాలినీ (పుట 266) గోపినీ (పుట 266) మొదలయినవిందు ప్రయుక్తములు. వీనికి నిజ రూపములు కుమరంగినటీ.

తమోనినీ మొదలయినవి. మతుబర్థంలో చేరిన 'ఇన అనే ప్రత్యయాంతముల్తైన గుణిన్ (గుణ+ఇన్) వానిపై స్త్రీలింగంలో ఈ చేరగా ఏర్పడిన గుణినీ, మొదలయిన పదములనుండి-ఇనీ అనేదాన్ని అనుచిత విభాగంవల్ల వేరుచేసి స్త్రీలింగద్యోతక ప్రత్యయము ఈనాటివారు కల్పించియుందురు. నేటి ఉత్తర భారత భాషలగు హిందీ మొదలయిన భాషలందేగాక ద్రావిడ భాషలందును ఈ 'ఇనీ, అనునది స్త్రీలింగబోధక ప్రత్యయముగ నుండుట గమనింపదగిన యంశము. సరదారిణీ, మాష్టరిణీ, రజకినీ, భాగవతారిణీ మొదలయినవీ సందర్భంలో గుర్తింపదగును.

మతుబంతములు :

భగవత్ మొదలయిన మతుబంతములకు మొదటి యైదు ప్రత్యయములు (ప్రథమా విభక్తిలో మూడు — ద్వితీయలో ఏక ద్వివచన) పదంగాగా తుది తకారానికిముందు 'న' చేరినందున గుణవన్త, భగవన్త మొదలియ రూపాలేర్పడుతాయి. పర సవర్ణమునకు అనుస్వారాన్ని ఈ భాషల్లో రాయటం నియతము. కాబట్టి రూపవంత (పుట 22) భగపంత (పుట 136) గుణవంత (పుట 132) హనువత (పుట 272, 463, 524, 548) బుద్ధివత (పుట 17) కులవంత (పుట 390) ఇందు గలవు. హను, బుద్ధి పదముల తరువాత 'వంత'లో వకు బదులుగ 'మ' రావలసి యుండుట సంస్కృత నియమము. కాని ఈ కవి తన భాషలో ఈ మార్పును గుర్తించియుండలేదు. ఈలి ప్రత్యయమును వకారాదిగనే గ్రహించెను. ఈ విధానము ప్రాచీన కన్నడ భాషలో గలదు.

అనంతాకాలమునందు హిందీ మొదలయిన ఉత్తరదేశీయుల భాషలందు ఈ ప్రత్యయము సంస్కృతమునందు వలెనే మకార వకారాదిగ ప్రయుక్తము. ఈ యంశమునందు తెలుగు సంస్కృత విధేయమేగాని తదతిరిక్త ప్రయోగము ఇందు గానరావు.

భూతార్థంలో ఇ :

భూతకాలికా సమాపక్రియారూప నిష్పత్తిలో క్త్వాల్యప్ అనే ప్రత్యయాలను సంస్కృతం వాడుక చేస్తుంది. (అష్టాధ్యాయి 3-4-21 మరియు 7-1-37) ఈ రెండింటికి సమానార్థంలో తెలుగునందేగాక తమిళాది ద్రవిడ భాషలందు 'ఇ' వస్తుంది. ఈ విధంగా క్త్వాకు మారుగా 'ఇ'ని వాడుక చేయటానికి తెలుగులో సూత్రమూలమయిన అనుమతి ఉంది.

పదుమావతి అనే ఈ కావ్యంలోని భాషలో క్త్వా లేదా ల్యప్ ప్రత్యయాలకు మారుగ - ఇ వాడుక చేసిన ప్రయోగాలు శతాధికంగా ఉన్నాయి. అనంతరకాలంలో ఇకార ప్రయోగం ఉందో లేదో చెప్పాలంటే మరల విపరీతంగా పరిశీలన గావింపవలసి యుంటుంది.

శతాధిక ప్రయోగాల్లో క్త్వాకు - ఇ ప్రయుక్తమయి ఉన్నందున దీన్ని యాదృచ్ఛికమని తోసివేయలేము.

'కృ' అనే సంస్కృత ధాతువునుండి 'కర్' అనే రూపం ఏర్పడుతుంది. ప్రాకృతాల్లో 'ఋ' అనే స్వరం లేదు. దీని స్థానమునందు ఏవేని యచ్చులుగానీ-రి గాని రావటాన్ని (స్వరాది చతుర్వర్ణస్య) ప్రాకృత వ్యాకరణా లంగీకరించాయి. ఈ విధానం వల్ల ఏర్పడిన కర్ అను క్త్వాల్యప్ ప్రత్యయాలకు మారుగా వాడుట చేయటం హిందీలో మిక్కిలి ప్రచురము. ఈ కర్‌కు పద్యాయము 'ఇ'ని వాడుక చేసిన ప్రయోగాలీ కావ్యంలో నూరుకు మించి దొరికాయి. ఈ రూపముల నీక్రింది యిస్తున్నాను.

| | |
|---|---|
| సంకోచ్‌కర్ (సంకోచ్+ఇ) సంకోచి | 90 |
| దేఖ్‌కర్ దేఖ్ > తాక్ (తాక్+ఇ) తాకి | 107 |
| సమర్పణ్‌కర్ సమర్పణ్ > సఉప్ (సఉప్+ఇ) సఉపి | 110 |
| చూర్ణకర్ చూర్ణ > చూర్ (చూర్+ఇ) చూరి | 114 |
| పరీక్షాకర్ పరీక్ష > పరఖ్ (పరఖ్+ఇ) పరిఖి | 119 |
| లాంఘ్‌కర్ లాంఘ్ > నాధ్ (నాధ్+ఇ) నాధి | 120 |

| | | | | |
|---|---|---|---|---|
| స్మరణ్‌కర్ | స్మరణ్ > సవర్ | (సవర్+ఇ) | సవరి | 136 |
| ఇచ్ఛాకర్ | ఇచ్ఛా > చాహ్ | (చాహ్+ఇ) | చాహి | 159 |
| నిరీక్షణ్‌కర్ | నిరీక్షణ్ > నిరఖ్ | (నిరఖ్+ఇ) | నిరఖి | 184 |
| దేఖ్‌కర్ | దేఖ్ > జోహ్ | (జోహ్+ఇ) | జోహి | ఐబిడి |
| తప్‌కర్ | | (తప్+ఇ) | తపి | 202 |
| గన్‌కర్ | గన్ < గణ్ | (గన్+ఇ) | గని | 243 |
| ఖేల్‌కర్ | | (ఖేల్+ఇ) | ఖేలి | 242 |
| మిల్‌కర్ | | (మిల్+ఇ) | మిలి | 612, 255 |
| మంద్‌కర్ | | (మంధ్+ఇ) | మంధి | 324 |
| బంద్‌కర్ | బంద్ > బాధ్ | (బాధ్+ఇ) | బాధ | 315 |
| దేఖ్‌కర్ | | (దేఖ్+ఇ) | దేఖి | 623, 321 |
| భాగ్‌కర్ | | (భాగ్+ఇ) | భాగి | 324 |
| డర్‌కర్ | | (డర్+ఇ) | డరి | 400 ఐబిడి |
| మర్‌కర్ | | (మర్+ఇ) | మరి | 330 |
| రక్ష్ రాఖ్‌కర్ | | (రాఖ్+ఇ) | రాఖి | ఐబిడి |
| హస్‌కర్ | హంస్ > హస్ | (హస్+ఇ) | హసి | 394 |
| కర్‌కర్ | కృ > కర్ | (కర్+ఇ) | కఇ | 394 |
| లగ్‌కర్ | | (లగ్+ఇ) | లగి | 398 |
| ఛోడ్‌కర్ | ఛోడ్ > ఛాడ్ | (ఛాడ్+ఇ) | ఛాడి | 398 |
| డర్‌కర్ | | (డర్+ఇ) | డరి | 400 |
| సుంగ్‌కర్ | | (సుంగ్+ఇ) | సుంగి | 401 |
| సున్‌కర్ | శ్రుణ్ > సున్ | (సున్+ఇ) | సుని | 403 |
| లేకర్ | | (లే+ఇ) | లేఇ | 424 |
| మూర్ఛాఖాకర్ | మూర్ఛా > మురఖ్ | (మురఖ్+ఇ) | మురఖి | 426 |
| భర్‌కర్ | | (భర్+ఇ) | భరి | 428 |
| ఛూకర్ | ఛూ అస్పృశ్య > పరస్ | (పరస్+ఇ) | పరసి | 428 |
| మర్‌కర్ | | (మర్+ఇ) | మరి | 430 |
| దేఖ్‌కర్ | | (దేఖ్+ఇ) | దేఖి | 430 |
| సున్‌కర్ | | (సున్+ఇ) | సుని | 524 433 |
| కర్(కర్)కే | | (కర్+ఇ) | కరి | 438 |
| ఉర్‌కర్ | | (ఉర్+ఇ) | ఉరి | 438 |
| బైఠ్‌కర్ | | (బైఠ్+ఇ) | (బైఠి) | 438 |
| జాగ్‌కర్ | జాగృ > జాగ్ | (జాగ్+ఇ) | జాగి | 522 440 |
| విచార్‌కర్ | | (విచార్+ఇ) | విచారి | 440 |
| పూజాకర్ | | (పూజా+ఇ) | పూజి | 442 |
| ధున్‌కర్ | | (ధున్+ఇ) | ధుని | 446 |
| జక్‌కర్ | జక్ > ధగ్ > ధాగ్ | (ధాగ్+ఇ) | ధాగి | 448 |
| దేఖ్‌కర్ | | (దేఖ్+ఇ) | దేఖి | 511, 454 |
| ఝూల్‌కర్ | ఝూల్ > ఝులా | (ఝూల్ + ఇ) | ఝులాఇ | 454 |
| ఖేల్‌కర్ | | (ఖేల్+ఇ) | ఖేలి | 456 |
| సున్‌కర్ | | (సున్+ఇ) | సుని | 488, 456 |
| గహ్‌కర్ | గహీ> గ్రహ్ | (గహ్+ఇ) | గహి | 518, 461, 588 |
| ఆకర్ | | (ఆ+ఇ) | ఆఇ | 462 |
| లగ్‌కర్ | | (లగ్+ఇ) | లగి | 465 |
| స్థిత్‌కర్ | స్థిత్ > రాడ్ | (రాడ్+ఇ) | రాడి | 469 |
| హస్‌కర్ | | (హస్+ఇ) | హసి | 470 |
| లగ్‌కర్ | లగ్ > లాగ్ | (లాగ్+ఇ) | లాగి | 470 |
| పైఠ్‌కర్ | పైఠ్ > పఇఠ్ | (పఇఠ్+ఇ) | పఇఠి | 468 |
| సంస్మరణ్‌కర్ | సంస్మరణ్> సఁవర్ | (సఁవర్+ఇ) | సవరి | 494 |
| రోకర్ | | (రో+ఇ) | రోఇ | 498 |
| లిఖ్‌కర్ | లఖ్ > లహ్ | (లహ్+ఇ) | లహి | 499 |
| పూజ్‌కర్ | | (పూజ్+ఇ) | పూజి | 502 |
| కహ్‌కర్ | | (కహ్+ఇ) | కహి | 507 |
| దాహ్‌కర్ | | (దాహ్+ఇ) | దాహి | 507 |
| హోకర్ | హ్ < భూ | (హో+ఇ) | హోఇ | 520 |
| వేద్‌కర్ | వేద్ < విద్ | (వేద్+ఇ) | వేది | 529 |
| ఆరాధన్‌కర్ | ఆరాధన్ < రాధ్ | (రాధ్+ఇ) | రాధి | 530 |
| బజాకర్ | బజా > సంవాద్ | (బజా+ఇ) | బజాఇ | 532 |
| కాఢ్‌కర్ | కాడ్ > కర్ష | (కాఢ్+ఇ) | కాఢి | 549 |
| గణ్‌కర్ | | (గణ్+ఇ) | గణి | 547 |
| అరుఝూకర్ | అరుఝూ> ఆరుహ్య | (అరుఝూ+ఇ) | అరుఝూఇ | 560 |
| పలట్‌కర్ | | (పలట్+ఇ) | పలటి | 567 |
| హేర్‌కర్ | | (హేర్+ఇ) | హేరి | 567 |
| సమాయ్‌కర్ | సమా > సమేవ్య | (సమా+ఇ) | సమాఇ | 568 |
| ఠగ్‌కర్ | | (ఠగ్+ఇ) | ఠగి | 583 |
| కహ్‌కర్ | | (కహ్+ఇ) | కహి | 584 |
| ఖీంచకర్ | ఖీంచ > కాఢ్ | (కాఢ్+ఇ) | కాఢి | 584 |

| | | | |
|---|---|---|---|
| లేకర్ | (లే+ఇ) | లేఇ | 584 |
| మేల్‌కర్ | (మేల్+ఇ) | మేలి | 584 |
| కోప్‌కర్ | (కోప్+ఇ) | కోపి | 586 |
| జాన్‌కర్ | జాన్ > జ్ఞా (జాన్+ఇ) | జాని | 593 |
| హన్‌కర్ | (హన్+ఇ) | హని | 595 |
| ధర్‌కర్ | (ధర్+ఇ) | ధరి | 599 |
| లాకర్ | లా > ఆన్ (ఆన్+ఇ) | ఆని | 612 |

ఇందు కొన్ని సంస్కృత ధాతుజన్యములు. కొన్ని తదన్యములు. ఇవన్నియు హలంతములే. కొలదిగ దీర్ఘాంతములు గలవు. దీర్ఘమునకు ఇ పరముగాగా సంధిలేదు. ధరి-ధరించి అని తెచ్చి అను రీతిని వేనికి తెలుగులో సమాస పదముల నూహింపనగును. 'ఇ' అను పదాంశము పదుమావతికి ముందుగానీ తదనంతరము వచ్చిన ఉత్తర దేశభాషలగు హిందీతోగాని ఈ యర్థంలో గలదేమో పరిశీలింపవలసి యున్నది.

రూప సాదృశ్యము :

సూరదాస్ తులసీదాసు రచనల్లోగూడ తెలుగులోగల కొన్ని పదాలకు తుల్యములైనవి గలవు. తెలుగులో మతుబంతముల్లో హనుమాన-హనుమంత, భగవాన-భగవంత అని పర్యాయపదం వాడుక కలదు. ఈ విధమైన సామ్యంపై మహాకవుల హిందీ రచనములందును గలదు.

తనపర్ణకము :

తెలుగులో తన త్వార్థంలో వస్తుంది. పై కవుల ప్రయోగాలలో బ్రాహ్మణతన, మృగతన అనే ప్రయోగాల్లో తమ తెలుగు ప్రత్యయంతో సమానార్థాలలో ఉంది. దీన్ని యాదృచ్ఛిక మనదగును. లేకున్న తెలుగులోని తనకు పర్యాయమైన త్వ అనే సంస్కృతం ప్రత్యయం ఇష్టస్వరాగమంవల్ల తమ మారగా యుష్మచ్ఛబ్దానికి షష్ఠీ ఏకవచనంలో ఇలాంటి రూపం ప్రసిద్ధ మయినందున ఈ తవ(త్వ)లో తుది 'వ' కారానికి అనునాసిక్యం విహితమై క్రమంగా వఁ=నగా మారియుండునని తలంచుట అశాస్త్రీయం గాదనిపిస్తుంది.

సంబోధనలో అంత్య స్వరదీర్ఘత :

తెలుగులో సంబోధనలో తుది స్వరానికి దీర్ఘం వస్తుంది. అలాంటి సందర్భంలో దీర్ఘ వచ్చిన రూపం "బోలో కృపా సింధు వృషకేతూ" అనే ప్రయోగంలో గలదు. ఇది సూర్ సాగర్‌లోని ప్రయోగాలు.

విన్నపము :

గ్రంథపర్యంవల్ల నాకు గలిగిన సందేహములను పాఠక లోకమున కందించుటయే నా యీ వ్యాస ప్రయోజనము. దీనిపై తగురీతిని చర్చ సాగించి వాస్తవమును విశదము గావింప పండితులను కోరుచున్నాను.

---

# త్రిమూర్తులు

**ఖమ్రొద్దీన్**

అనంత చీకటిని
అధిగమించి,
"వెలుగుపూలు"
చల్లేవాడు—
సూర్యుడు!

అమావాస్యని
అపహసించి,
"వెన్నెల కుప్పలు"
ఆడేవాడు—
చంద్రుడు!

ఆ వెలుగు పూలలోంచి,
ఆ వెన్నెల కుప్పలలోంచి
నడుచుకుంటూ
"జీవన తీరాలు"
చేరేవాడు—
మానవుడు!!!

[మా దిలావర్ అన్నయ్యకు కృతజ్ఞతతో....]

# గురువుగారి కలకల నవ్వు*

## శ్రీ తంగిరాల వెంకట సుబ్బారావు

అందమైన బెంగుళూరు బస్సు అద్దాల కిటికీలోంచి
అనుభూతుల రంగుల జ్ఞాపకాలు చల్లుకుంటూ
వస్తున్నాను....
చిత్తూరుజిల్లా లోయల్లో పచ్చని వరిపొలాలు
పైరగాలికి తలలూపడం చూస్తున్నాను....
మండే వేసవి ఎండల్ని మదనపల్లి హార్సీ హిల్స్
చెరపట్టాయి....
చంద్రగిరి దుర్గంలో కాలం చరిత్రా కలిసి
ఘనీభవించాయి....
తిరుపతికొండ స్థిరంగా నుంచుంది
దీసాల తిరునామంతో దీవించింది
'మహాసముద్రం' చెరకుతోటల్లో
రామచిలుకలదండు కిలకిలారావం చేసింది
గురువుగారి కలకల నవ్వు నా గుండెక్రింద
మంచి గంధం పూసింది....

2

ఈ క్యాంపస్‌లో ఒకప్పుడు
సిమెంటు చత్రాలలో నక్కిన చిన్ని మొక్కలు
ఇప్పుడు మహావృక్షాలుగా ఎదిగి
గాలిలోకి చేతులు చాచి
నిత్యయౌవనులైన విద్యార్థులమీద
నీడల గుబ్బగొడుగులు పడుతున్నాయి....
యూనివర్శిటీ శంఖుస్థాపనలో పూజింపబడిన ఇటుక
దేవేంద్రభవనంగా పైకి లేచి
మేఘాల కాశ్మీరు శాలువా కప్పుకుంటోంది....
లేత మమలపాకులాంటి ఒక రైతుబిడ్డ
"ఇంతింతై వటుడింతయై...." పెరిగి
భాషా సాహిత్య సౌహిత్యాల త్రివిక్రముడై
విశ్వవిద్యాలయ బ్రహ్మాండాన్ని ఆక్రమించి
అందరికీ అభయ హస్తమిచ్చాడు
ఏ బలి చక్రవర్తిమీదా మూడో పాదం మాత్రం మోపలేదు!
ఉపాధ్యాయ వృత్తిరూపకంలో
తన పాత్ర తాను నిర్వహించి స్టేజిమీంచి తప్పుకుంటు
న్నాడు....
షష్టిపూర్తి గ్రీన్‌రూంలో వేషభూషణాలు విప్పుకుంటు
న్నాడు....
ఈయన మా గురువర్యుడు
నిరంతర పరిశోధనాధుర్యుడు
శిష్యవాత్సల్య సముద్రుడు
అవినీతిపాలిటి రుద్రుడు!
జీవితాన్ని పువ్వుల కిరీటంగా ధరించి
అందరికీ నవ్వులు పంచినవాడు
వంచన ఏ కోశానా లేని మంచివాడు!
నిప్పులు గుప్పిట పట్టినవాడు! నీతిని *ప్రేమించినవాడు!!

3

శేషశైల శిఖరంమీద కురిసిన పూలవాన
లేళ్లుగా చెంగలించి
సెలయేళ్లుగా పరుగులెత్తి
జలపాతాలుగా ధుమికి

---

* 8-8-1988 నాడు తిరుపతిలో జరిగిన గురువర్యులు ఆచార్య జి. యస్. రెడ్డిగారి షష్టిపూర్తిసభలో చదివిన కవిత.
* 'సునీతను' పాఠాంతరం.

నదీ నదాలుగా వరదల ఊరేగింపులు చేసి
నలుదిక్కులా గంభీర సాగరాలుగా విస్తరించి
కెరటాల పడగలు విప్పి
కేరింతలు కొడుతోంది....
సారస్వత శివతాండవం చేస్తోంది....
అందులో ఆకాశం తన లావణ్యం చూస్తోంది....
బాలాజీ మెడలోని గులాబీదండలా
గురువుగారి కర్పూరపు నవ్వు నా గుండెక్రింద
గుభాళిస్తోంది....

4

మనుషులు వస్తారు పోతారు
నదులు మాత్రం ప్రవహిస్తూనే ఉంటాయి....
నక్షత్రాలు నవ్వుతూ ఉంటాయి
పక్షులు పాడుతూ ఉంటాయి
అరణ్యాలు ఆడుతూ ఉంటాయి
సూర్యచంద్రుల దాగుడుమూతల్ని
పర్వత శిఖరాలు చూస్తూ ఉంటాయి....
తెలుగు భాషాసాహిత్యాల సుప్రభాత కిరణాలతో
ఏడుకొండలవాడి పాదాలముందు
ఎప్పుడూ
అజ్ఞాన హిమం కరుగుతూనే ఉంటుంది
అఖండజ్యోతి వెలుగుతూనే ఉంటుంది....
మంచి గంధంలాంటి
మలయమారుతంలాంటి
మల్లెపూల పరిమళంలాంటి
మా గురువుగారి కలకల నవ్వు
శిష్యుల గుండెలక్రింద జలజల ప్రవహిస్తూ
మళ్ళీ మళ్ళీ
మళ్ళు తిరుగుతూనే ఉంటుంది....
భవతు!

---

# మనిషి మగతగా వున్నాడు

## శ్రీ ఆడిగోపుల వెంకటరత్నమ్

ఒక్కో ఓటు కోసం
ఒక్కో చట్టం చేస్తున్న
ఓ ప్రభుత్వమా
ఆరుగురు ఒకేసారి
ముఖాన్ని చూసుకోను
అద్దాన్ని ముక్కలు చెయ్యడం
పరిష్కార మార్గం కాదు!
మనిషి మగతగా వున్నాడు
మోసం చెయ్యకు
సమాజం స్తబ్ధంగా వుంది
అనువుగా తీసుకోకు!
తెగిన తీగలోంచి
రాగం ఆగిపోదు
అతికించిన తీగ మళ్ళీ
అదే రాగం పలుకుతుంది
మీటు వేళ్ళలో వుంది మహత్యం!
బండరాయి బండలా వుండి పోదు
రాగాలు పలుకుతుంది
మలిచే ఉలిలో వుంది మహత్యం!
నిద్రిస్తున్న కళ్ళ వెనుక
నిప్పులు రాజుకుంటున్నవి
అప్రమత్తత వేచివుంది!
మనిషి ఇసుకలో తలదూర్చింది
ఉష్ట్రపక్షి వ్యవహారం కాదు
తైలాన్ని పిండడానికి!

# శ్రీ పెన్నా శివరామకృష్ణ

# "ప్రతీక" - పరిశీలన

"యాజ్ ఫార్ యాజ్ ధాట్ ఈజ్ కన్‌సర్న్‌డ్ అండ్ ఎట్ ఆల్ లెవెల్స్ ఆఫ్ థాట్. ఇటీజ్ ఎ సింబాలిక్ ప్రాసెస్....ది ఎసెన్‌షియల్ యాక్ట్ ఆఫ్ థాట్ ఈజ్ సింబలైజేషన్"[1]. —రిచి

నిరంతర భావప్రసరణం మానవ అంతరంగ లక్షణం. పరిసరాలను తమ కనువుగా మార్చుకోలేక తామే పరిసరాల కనుగుణంగా ప్రవర్తించటం అనేక మానవేతర ప్రాణుల లక్షణం. వ్యక్తి స్వభావానుగుణంగా బహిర్జగత్తును మలచుకోవడం అతని సహజ స్వభావం. బహిర్జగత్తును మలచుకోవటంలో బౌద్ధికశక్తి ప్రేరకమే కాని కార్యసాధకం కాదు. ఈ దశలో పరస్పర సహాయ సహకారాల కోసం ఏర్పడింది సామాజిక జీవనం. మానవశక్తి సంఘటితం కావడం మానవ మహాప్రస్థానంలో ప్రథమసోపానం. దీనిని సాధించింది భావ వినిమయం.

అనిర్దిష్టమైన ధ్వనులే మొదట భావ ప్రసారవాహకాలు. అర్థానుగుణంగా లిఖిత సంకేత రూపాలు ఏర్పడటం మరోదశ. "అలేఫ్ అంటే ఎద్దు. దానికి ఈజిప్ట్‌లో రెండు కొమ్ముల సంకేతం ఉండేది. అది క్రమంగా హిక్, హినీషిమా, పాత గ్రీక్, స్లావు భాషల్లో పరివర్తన చెంది తల్లక్రిందులై నేటి ఇంగ్లీషు 'A' గా మారింది. 'బేత్' అంటే ఇల్లు. అది ఈజిప్ట్ భాషల్లో ▭ ఇలా ఉండేది. అది క్రమంగా పరిణామం చెంది నేటి ఇంగ్లీషు 'బి'గా మారింది."[2] అర్థానికి లిఖిత రూపానికి ఉన్న సంబంధం క్రమంగా నశించి ప్రతిలేఖన చిహ్నం ఒకానొక విశిష్ట ధ్వనికి సంకేతమాత్రమయింది. మానవ భావాభివ్యక్తికి ఏర్పడిన సంకేతచిహ్నాలే పరిణామదశలో అనేకాలైన మార్పులు చెంది నేటి లిపులుగా రూపొందెనాయి. "కేవలం మానవతాసంబంధమైన సహజాతేతర పద్ధతిద్వారా భావములను (ఐడియాస్), రసభావములను (ఎమోషన్స్), వాంఛలను అలవోకగా ఉత్పన్నమయ్యే కంఠధ్వనుల సాధనాలతో వ్యక్తీకరింపబడు ప్రతీకల సమూహమే భాష" అన్నాడు సఫీర్.[3]

భావానికి సంకేతమైన భాషద్వారా సమస్త సృష్టిని మానవుడు అభీష్టానుగుణమైన వస్తునిర్మాణంచేత నింపివేశాడు. సమస్త విశ్వానికి ప్రతీక మనిషి అయితే, మానవుని భావాలకు ప్రతీకలే నిర్మిత వస్తుజాలం. ఈ విధంగా ప్రాథమికస్థాయి నుండి మానవ సంస్కృతి వికాసానికి ప్రతీకాత్మక ప్రవృత్తే దోహదం చేసినట్లు తెలుస్తుంది.

వైదిక సాహిత్యం : ప్రతీకాత్మకత :

భారతీయ సంస్కృతికి మూలాలు వేదాలు. వేదధర్మాన్ని రక్షించటం, వేదస్వరూపాన్ని సర్వజన సుబోధం కావించటం పరమ ప్రయోజనంగా అవతరించాయి. ఉపనిషత్తులు, దర్శనాలు, స్మృతులు పురాణేతిహాసాలు.

"సింబాలిజం ఈజ్ హౌ ఎవర్ నాట్ న్యు టు ఇండియన్ లిటరేచర్. ది ఎర్లియస్ట్ ఫేజ్ ఇన్ ఇండియా ఈజ్ పర్‌హాప్స్ సింబలిజం. యాజ్ ఎ మాటర్ ఆఫ్ ఫాక్ట్ ది హోల్ ఆఫ్ వేదిక్ లిటరేచర్ ఈజ్ యాన్ ఇల్లస్ట్రేషన్ ఆఫ్ ఎర్లీ సింబలిజం ఇన్ ఇండియా. వెరీ ఆఫెన్ ది వేదిక్ హిమ్న్స్ డు నాట్ కన్వే ఎనీథింగ్ ఇన్ ది లిటరల్ సెన్స్." (రక్తరేఖ. పు. 187.)

భారతీయ సాహిత్యంలో ప్రతీకాత్మకత వైదికసాహిత్యంతోనే ప్రారంభమయింది. శబ్దాలకు సాధ్యమైనంత అర్థపుష్టినిచ్చి నానార్థ ప్రతిపాదకశక్తి కలిగించడంలో సంస్కృతభాష వాటికి బాగా తోడ్పడింది. ఆనాటినుంచి ఈనాటివరకు ప్రజాసామాన్య మవలంబిస్తున్న ప్రకృతి దేవతారాధనలను, బాహ్య కర్మకాండలను వ్యక్తీకరిస్తూ, మరొకవైపు మానవజాతి పురోభివృద్ధి కొరకు వారానాడు సాధించిన అత్యంతోత్కృష్టమైన ఆధ్యాత్మిక జ్ఞాన అనుభవాలకు మానవాత్మ సంస్కారానికి యోగ్యమైన సార్థక రహస్య సంకేతాలుగా ఉండటం వైదిక సాహిత్యం యొక్క విశిష్టత.

ఇట్టి వైదిక సాహిత్యానికి సాయణులు కర్మకాండపరంగా అర్థం చెప్పగా, ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మికార్థాలు అనే త్రివిధార్థాలున్నాయని యాస్కాచార్యులు చెప్పినారు.

ఆర్య ద్రావిడ సంఘర్షణలకు ప్రతిబింబమే వైదిక సంస్కృతి అని పశుధనాన్నే పరమ ధనమనుకునే పశుపాలక సంస్కృతే ఋగ్వేద ఆర్యుల సంస్కృతి అని కొందరు ఆధునికులు వేదాల అపౌరుషేయత్వాన్ని అంగీకరించలేదు. అట్టి స్థితిలో నిగూఢ వేదరహస్యాలను వెలికితీసి సత్యార్థప్రకాశాన్ని కలిగించినవారు అరవింద దయానందులు.

"ద్వాసుపర్ణా సయుజా సఖా యా
సమానం వృక్షం పరిషస్వజాతే
తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యన
శ్నన్నన్యో అభిచాకశీతి"[4]

దీనిలో వృక్షాన్ని 'సంసారాని'కి పై కొమ్మమీది పక్షిని ఈశ్వరునికి క్రింది కొమ్మమీది పక్షిని 'జీవుని'కి, ఫలాలు కర్మ ఫలాలకు ప్రతీకలుగా గ్రహించడం జరిగింది.

ఈశ్వరుని విశ్వవ్యాపకునిగా దర్శించిన మహర్షులు ప్రకృతిని సర్వ జీవజాలాన్ని ప్రతీకలుగా గ్రహించడం కనిపిస్తుంది. వైదికఋషులు వృక్షాలను, నదులను, సముద్రాలను, ప్రతీకలుగానే వర్ణించారు. భారతీయ దార్శనిక తత్త్వవిచారాలన్నింటిలో అస్తిత్వవర్తనం నిరంతర పారావారంగా ఉత్ప్రేక్షితమై ఉన్నదని, శ్రీ మహావిష్ణువు శయనించిన క్షీరసాగరమే శాశ్వత అస్తిత్వ పారావారానికి సంకేతమని ఆయన సృష్టికి పూర్వమనంత వలయాలపై నిద్రించాడని అదే శేషతల్పమని శ్రీ అరవిందులు[5] వివరించారు.

నదీ సముద్రాలనేగాక పంచభూతాలలోనివైన భూమ్యాకాశాలను, అగ్ని ఆపస్సులను మిధునాలు వర్ణించటం గమనించవచ్చు. గోవులు అశ్వాలు కాంతికిరణాలకు, ఓజశ్శక్తికి ప్రతీకలుగా వర్ణించబడినాయి.[6]

అదేవిధంగా వారు ప్రస్తుతీకరించిన కర్మకాండలు కేవలం భౌతిక ప్రక్రియలు కావు. కర్మకాండలన్ని పరమాత్మలో ఐక్యాన్ని సాధించే యత్నంలో ఆంతరిక శిక్షణలుగా భావింపవచ్చు.

యజ్ఞాన్ని విష్ణుస్వరూపం అన్నది శతపథ బ్రాహ్మణం. యజ్ఞాగ్ని అనగా కేవలం భౌతికమైన అగ్నికాదు. బ్రహ్మరూపమైన అగ్ని లేక బహ్మాభిముఖమైన శక్తి అంతరాగ్ని, దానిలోనే ఆహుతి చెయ్యాలి. లేక అగ్ని అంటే సంయమరూపాగ్ని లేక విశుద్ధ ఇంద్రియవృత్తి[7]. యజ్ఞశేషంగా ప్రాప్తించిన అమృతానికి ప్రతీక సోమరసం. ఉపాసనలు మూడు విధాలు. బ్రహ్మోపాసన, మంత్రోపాసన, ప్రతిమోపాసన. ఓంకారం మంత్రోపాసనకు మకుటం. "ప్రణవో హ్యాపరం బ్రహ్మప్రణవశ్చ పరంస్మృతః"[8], ఓమితిబ్రహ్మ, ఓమితీదం సర్వం"[9] అన్నవి ఉపనిషద్వాక్యాలు. ఋగ్, యజు స్సామ వేదాలకు (క్రమంగా) ప్రతీకలైన 'అ'కార, 'ఉ'కార 'మ'కారాత్మకం ఓంకారం. "అగ్నిమీళే పురోహితమ్" అనే ఋగ్వేద ప్రథమ మంత్రంలోని ప్రథమవర్ణం - 'అ'కారం; యోనిస్సముద్రో బన్ధుః" అనే యజుర్వేద ప్రథమ వాక్యంలోని మధ్యమవర్ణం – 'ఉ'కారం; "అసమానాంతరమ్" అను సామ వేద ప్రథమ వాక్యంలోని కడపటి వర్ణం - 'మ'కారం; ఈ మూడింటియొక్క చేరికయే 'ఓమ్' అను పదమయిందని చెప్పబడుతూంది.

పంచాక్షరీ, గాయత్రీ మొదలైన సర్వమంత్రాలు ప్రతీకాత్మకాలేనని ఉపనిషత్తుల వలన తెలుస్తుంది. తంత్ర శాస్త్ర ప్రవర్తితాలైన శ్రీచక్రాదులు, యోగశాస్త్ర ప్రబోధితాలైన కుండలిన్యాదులు ప్రతీకాత్మకాలే.

పరమాత్మకు ప్రకృతి రూపం, వికృతిరూపం అని రెండు విధాలైన రూపాలున్నాయి. కనబడనిది ప్రకృతి. సమస్త ప్రపంచం వికృతి రూపం. పూజ కాని ధ్యానం కాని ఒక రూపమున్నప్పుడే కుదురుతుంది. ఈ విధంగా రూపుదాల్చినవే దేవతా ప్రతిమలు. దేవతలు, వారి అలంకరణలు, ఆయుధాలు, సర్వం ప్రతీకలేనని గమనించవచ్చు.

ఫ్రెంచి ప్రతీకోద్యమం

19వ శతాబ్దంలో వచ్చిన తాత్త్విక దర్శనాలు ప్రపంచానికి నూతన ఆలోచనాల నిచ్చాయి. ఈ శతాబ్దంలోని రాజకీయ విప్లవాలు, శాస్త్ర పరిశోధనలు, సాంఘిక సిద్ధాంతాలు విశ్వాత్మకు వినూత్న దర్శనాన్నిచ్చాయి. రాజకీయ విప్లవాలు సాంఘిక సిద్ధాంత దర్శనాలకు ప్రచ్ఛన్నంగా కవాటాలు తెరిచాయి. శాస్త్ర పరిశోధనలు బౌద్ధిక జీవితానికి బాటలు వేశాయి. ఈ స్థితిలో అస్థిరత్వంపాలైన భౌతిక జీవనం అస్తి నాస్తి విచికిత్సపాలైన ఆధ్యాత్మిక జీవనం ఆనాటి ప్రపంచ సాహితీ వ్యవస్థలన్నిటా ప్రతిబింబించాయి.

19వ శతాబ్దం చివరి రెండు దశాబ్దాలలో ఫ్రాన్స్ సాహిత్యంలో ఉద్భవించిన ప్రతీకోద్యమం ప్రపంచ

సాహిత్యాన్ని ప్రభావితం చేసింది. భౌతికవాద దృక్పథానికి కళాత్మక రూపాలుగా నిలిచిన వాస్తవికతావాద (రియలిజమ్) ప్రకృతి వాదాలకు (నేచురలిజమ్) వ్యతిరేకంగా వచ్చిన ఉద్యమం ప్రతీకోద్యమం. అతీంద్రియానుభవాలను విశ్వసించక ఇంద్రియానుభవాలే ప్రమాణాలుగా సృష్టినంతటిని కార్యకారణ సంబంధ దృష్టితో వ్యాఖ్యానించటం వాస్తవిక వాగతత్త్వం

మితవాస్తవికతా వాదమని, తీవ్ర వాస్తవికతా వాదమని దానిని రెండు రకాలుగా విభజించుకుంటే తీవ్ర వాస్తవికతా వాదాన్నే ప్రకృతి వాదమనవచ్చు.

"నేచురలిజమ్ ఈజ్ నం టైమ్స్ క్లైమ్డ్ టు బి మోర్ ఈవెన్ మోర్ యాకురేట్ పిక్చర్ ఆఫ్ లైఫ్ దాన్ ఈజ్ రియలిజమ్. దిస్ థీసిస్, ఎ ప్రొడక్ట్ ఆఫ్ పోస్ట్-డార్వీనియన్ బయాలజీ ఇన్ ది మిడ్ — నైన్‌టీన్త్ సెంచరీ హెల్డ్ దట్ మ్యాన్ బిలాంగ్స్ ఎన్‌టైరలీ ఇం ది ఆర్డర్ ఆఫ్ నేచర్ అండ్ డజ్‌నాట్ హేవ్ ఎ సోల్ ఆర్ ఎనీ అదర్ కనెక్షన్ విత్ ఎ రిలీజియస్ ఆర్ స్పిరిచువల్ వరల్డ్ బియాండ్ నేచర్; దట్ మాన్ ఈజ్ దేర్‌ఫోర్ మియరలీ ఎ హైయర్ - ఆర్డర్ యానిమల్ హోజ్ క్యారెక్టర్ అండ్ ఫర్ ఛ్యూన్స్ అండ్ డిటర్‌మిన్డ్ బై టు కైండ్స్ ఆఫ్ నేచురల్ ఫోర్సెస్, హెరిడిటీ అండ్ ఎన్విరాన్‌మెంట్." [10]

ప్రకృతివాదం జగదతీత శక్తులను విశ్వసించని మానవుని బౌద్ధిక వికాసాన్ని పొందిన ప్రకృతిలోని ఒక ప్రాణిగా పరిగణిస్తుంది. మానవ స్వభావాన్ని వంశపారంపర్య లక్షణాలతో పరిసరాల ప్రభావాలతో అనుశీలించటం ఈ వాద లక్షణం. డార్విన్ పరిణామవాదం ఈ వాదానికి ప్రాణం.

"రియలిజం కంటిన్యూవల్లీ మేడ్ యాన్ అప్పీల్ టు ది ఇంటలెక్చువల్ సింపతీ ఆఫ్ రీడర్స్ విత్ హార్డ్ బ్రూటల్ డిస్క్రిప్షన్స్ దట్ రౌజ్‌డ్ ఎట్ బెస్ట్. ది బిట్టర్ జాయ్ ఆఫ్ సీయింగ్ థింగ్స్ యాజ్ దే ఆర్. సచ్ ఫుడ్ నీడెడ్ ఎ స్ట్రాంగ్ స్టమక్; ఇట్ మైట్ బి హెల్దీ బట్ ఇట్ లెఫ్ట్ యాన్ ఆఫ్టర్ టేస్ట్ ఆఫ్ సాడ్‌నెస్; ది హోల్ ఎంటర్‌టైన్‌మెంట్ లాక్‌డ్ మ్యూజిక్, అండ్ ప్రొవైడెడ్ సమ్‌థింగ్ ఆఫ్ ది కోల్డ్ సాటిస్‌ఫాక్షన్ ఆఫ్ వాచింగ్ ఎ థీరెమ్ ప్రాపర్‌లీ డిమాన్‌స్ట్రేటెడ్." [11]

సత్యం శాస్త్రలక్షణమని, సత్యాన్ని యథాతథంగా వ్యక్తీకరిస్తే స్వభావోక్తి కావచ్చుగాని, స్వభావోక్తియే సాహిత్యధర్మం కాదని సత్యానికి అభివ్యక్తి సౌందర్యం తోడైనపుడే కవిత అనబడుతుందని భావించారు ప్రతీకవాదులు.

188 రవ సంవత్సరం సెప్టెంబర్ 18వ తేదీన జీన్ మోరియస్ 'ఫిగరో' అనే వార్తాపత్రికలో ప్రతీకవాద ప్రణాళిక (సింబాలిజమ్ మేనిఫెస్టో)ను ప్రకటించాడు. కాల్పనికవాద కాల మయిపోయిందని కవితలో 'పర్నాసియన్' ఉద్యమం, నవలా రచనలో ప్రకృతివాదం అంత్యదశకు వచ్చాయని అందువలన నూతనమయిన కళారూపానికై లోకమెదురు చూస్తున్నదని ప్రణాళికలో ప్రకటించారు. బోదలేర్‌ను తదుద్యమ నాయకుడుగా, కళాప్రవక్తగా ప్రశంసించారు. జీన్‌మోరియస్ 'సింబలిస్ట్ స్కూల్' అనే పేరుతో ఒక కవి సంఘాన్ని స్థాపించాడు. కథా రహితత్వం, అస్పష్టమైన అనుభూతులను ప్రతీకలద్వారా వ్యక్తపరచటం వీరిలో కనిపిస్తుంది. ఈ వాదంలో మరో ఉపశాఖ వేదాంతం. వేదాంతం తాత్త్విక మార్గానికి దారితీసి కవితలో మార్మికత చోటు చేసుకుంటుంది. ప్రత్యక్ష కథనం కంటె పరోక్ష కథనానికి, వాచ్యతకంటె రసభావ (ఎమోషన్స్) సూచనకు ప్రాధాన్యమిచ్చారు. కేవలం వాతావరణాన్ని కల్పించి రసభావ సూచన చేయటంలో కవితకు లయాత్మకతను సంతరించటంలో వీరు సంగీతాన్ని ఆదరించారు.

ప్రతీకవాదం, సంగీతం చిత్రలేఖనాలలోని అభిరుచివాదానికి (ఇంప్రెషనిజం), బెర్గ్‌సన్ వ్యక్తావ్యక్త చేతనా తత్త్వానికి సమకాలికం. ప్రతీకవాదం 19వ శతాబ్దిలో ఉద్భవించిన భావవాదం (ఐడియలిజం)తో ఏకీభవిస్తుంది. విశ్వసంబంధమైన అవ్యక్తభావం (మిస్టికల్ కాన్సెప్షన్ ఆఫ్ యూనివర్స్)తో ప్రతీక వాదానికి నవీన ప్లేటో వాదం (నియోప్లెటానిజం)తో సాధర్మ్యముంది

ఇంగ్లీషు కాల్పనిక కవిత్వం, కార్లైల్, ఎమర్సన్‌ల తాత్త్విక దృక్పథం, స్కోపెన్‌హోవర్ నిరాశావాదం, రష్యన్ నవలలలోని మార్మికత వాగ్నర్ సంగీతం మొదలైనవి ప్రతీక వాద కవులను ప్రభావితం చేసి ఉండవచ్చునని ఫ్రెంచి సాహిత్య చరిత్రకారుడు కిజామెన్ అభిప్రాయపడినాడు.

బోదలేర్ మొట్టమొదట తన ప్రయోగాలద్వారా ప్రతీకలకు ఉన్నతస్థానాన్ని కల్పించగా, వెర్లైన్ ప్రతీకల ప్రయోగంలోని సహజత్వాన్ని నిరూపించాడు. మల్లార్మే ప్రతీకల ప్రయోగానికి ఆధ్యాత్మిక భావభూమికను సిద్ధపరిచాడు.[12]

బోదలేర్ (1821-67); వెర్లైన్ (1844-96)లో ఛందస్సుకు గీతిమాధుర్యానికి ప్రాధాన్యమివ్వగా, రేంబో స్వచ్ఛతో గద్యకవితను వ్రాశాడు. ప్రతీక వాదానికి బోదలేర్, వెర్లైన్, రేంబో (1854-91), మల్లార్మే (1842-98) అను లుగురు ఆచార్యులుగా చెప్పవచ్చు.

ప్రపంచ సాహిత్యాలన్నిటిమీద ప్రతీకవాద ప్రభావ ముంది. బర్క్‌లీ, కీట్స్, కార్లైల్, కాలెరిడ్జ్, షెల్లీ, రస్కిన్, రోజెట్టీ, మోరిస్, స్విన్‌బర్న్, వాల్టర్ పీటర్ మొదలైన బ్రిటిష్ రచయితలమీద, షిల్లింగ్, ఫిక్టే, హెగెల్, హోల్డర్లీన్, హాఫ్‌మెన్, స్కోపెన్ హోవర్, వాగ్నెర్ మొదలైన జర్మనీ రచయితలమీద ప్రతీకవాద ప్రభావముంది. ఇంకా ఈట్స్, డిలాన్‌థామస్, ఇలియట్, జాయిస్ మొదలైనవారిమీద కూడ ఈ ప్రతీకవాద ప్రభావమున్నట్లు తెలుస్తుంది.

"నెవర్దలెస్, సింబాలిజం లెఫ్ట్ ఎ డీప్ మార్క్ ఆన్ ది ఏజ్ యాజ్ ఎ హోల్ అండ్ స్టాంప్డ్ ఇట్‌సెల్ఫ్ అపాన్ మెనీ రైటర్స్ హు వర్ అపోజ్డ్ ఆర్ ఇన్‌డిఫరెంట్ టు ఇట్. ఇట్ డిడ్‌నాట్ డై ఆఫ్టర్ 1914, బట్ ఇన్ ఇట్స్ బ్రాడర్ స్పిరిట్ స్టిల్ లివ్స్ ఆన్. ఎ డిఫ్యూజ్ బట్ యాక్టివ్ లీవెన్. వాటెవర్ మే హేపెన్ ఇన్ ది ఫ్యూచర్. ఇట్స్ ట్రాన్సెయింట్ ఫర్‌చ్యూన్ విల్‌నాట్ బి ఫర్‌గాటిన్ ఇన్ ది లిటరరీ మెమొరీ ఆఫ్ ది ఫ్రెంచ్ నేషన్"[13]

ప్రతీక నిర్వచనాలు :

సింబల్ అనే పదానికి చిహ్నం, గుర్తు, సంకేతం లేక ప్రతీక అనేవి తెలుగులో సమానార్థకాలు. మోనియర్ విలియమ్స్ కూర్చిన సంస్కృత నిఘంటువులో మాత్రం 'ప్రతీక'కు 'సింబల్' అనే అర్థం ఉంది ఆ అర్థం ఛాందోగ్యంనుంచి గ్రహింపబడినట్లు సూచింపబడింది. "సింబల్" అను పదమునకు ప్రతీకార్థము చాల విరళముగా చెప్పబడియున్నదనియు లింగ, చిహ్న సంజ్ఞా సంకేతార్థములే బహుళముగా గలవనియు మన మంగీకరింపక తప్పదు. సుప్రసిద్ధ (మోనియర్ విలియమ్స్) నిఘంటువులో ప్రతీక శబ్దమునకు 'సింబల్' అనునర్థము ఉదాహరణ పూర్వకముగా చెప్పబడియున్నది. మరియు సుప్రసిద్ధ విమర్శకులనేకులు ప్రతీక, ప్రతీకవాదము అను పదములను పెక్కు తావుల వాడియున్నారు.[14] అని పూర్వ పరిశీలకులు భావించారు. సాహితీ లోకంలో ప్రచలితమైయున్నట్లు 'ప్రతీక' శబ్దాన్ని 'సింబల్'కు; 'ప్రతీకవాదం' అను పదాన్ని 'సింబాలిజం'కు సమానార్థకంగా గ్రహింపబడుతున్నది.

"దధాతే అమృతే సుప్రతీకే" అని ఋగ్వేద ప్రయోగం. సాయణభాష్యంలో దీనికి 'రూపం' అని అర్థం చెప్పబడింది. ప్రతీక అనగా అవయవం, అనుకూలం, ప్రతికూలం అని అమరం 'ప్రత్యేతి ప్రతీకః' ప్రతిగా నుండునది. 'టు పుట్ టుగెదర్' అనే అర్థం ఉన్న గ్రీకు భాషలోని 'సింబలీన్' అనే క్రియనుంచి ఏర్పడిన ఆంగ్లరూపం 'సింబల్'. "బుద్ధిచేత భావన చేత గ్రహింపగలిగినట్టిది. పరిశీలనను రేకెత్తించునట్టిది. అయిన ఏదో ఒక ఆలోచననుగాని, రసభావాన్నిగాని, అనుభవాన్నిగాని వ్యంజించు దృశ్యాత్మకమైన లేక ధ్వన్యాత్మకమైన (ఆడిబుల్) చిహ్నాన్నే ప్రతీకగా భావించవచ్చు."[15]

సహేతుకతద్వారా గాని సంబంధంవలన గాని తనకంటె ఇతర వస్తువును ధ్వనింపజేయునది లేదా దృశ్యేతరమును వ్యక్తీకరించు దృశ్యమాన వస్తువు ప్రతీక అని మోడర్న్ ఇంగ్లీషు డిక్షనరీ చెబుతున్నది. అప్రస్తుత విషయంయొక్క సమస్త ధర్మాలను, గుణాలను సమన్వయించుకొని ప్రతినిధిత్వం వహించే అప్రస్తుత విషయాన్ని ప్రతీక అనవచ్చు.

ప్రతీక, సంకేతం అనే పదాలు సమానార్థకాలుగానే వాడబడుతున్నాయి. పరోక్ష (అజ్ఞాత) వస్తువ్యంజనకు తోడ్పడేది ప్రతీక కాగా, సామాన్యం, స్థూలం అయిన వస్తువుకు ప్రతిగా స్వీకరింపబడేది సంకేతమనవచ్చు. సంకేతం స్థూలమైనదైతే ప్రతీక సూక్ష్మమైనది. ప్రతీకలో ఆరోప్యవస్తువుకు ప్రాధాన్యముంటుంది. సంకేతంలో ఆరోప్య విషయానికి ప్రాధాన్యముంటుంది.

సైన్స్ (గుర్తులు) మే బికమ్ సింబల్స్ అండ్ సింబల్స్ మే సొ టు స్పీక్ డిజెనరేట్ ఇన్ టు సైన్స్ (గుర్తులు) సమ్ డిస్టింక్షన్ మస్ట్ హవెవర్ బి మేడ్ అదర్‌వైజ్ ది ఎంటైర్ నోషన్ ఆఫ్ సింబాలిజం బికమ్స్ మీనింగ్‌లెస్. ఇట్ మే విల్ బి దట్ వైల్ ఆల్ సింబల్స్ ఆర్ ఇన్ ఎ సెన్స్ సైన్స్ (గుర్తులు) నాట్ ఆల్ సైన్స్ ఆర్ సింబల్స్."[16]

అనుభూతిజన్యమైన ప్రతీక ఆరోప్య వస్తువుతో సాదృశ్యసాధర్మ్యలను కలిగి సంశ్లిష్టమవుతుంది. అట్లుగాక స్థూలంగా విషయ వ్యక్తీకరణం చేసేది సంకేతం. ఆరోప్య ఆరోపిత సంబంధాన్నిబట్టి ప్రతీకలన్ని సంకేతాలుగా చెప్పవచ్చును. కాని సంకేతాలన్ని ప్రతీకలుగా చెప్పలేము.

ప్రతీక ప్రయోగం సాహిత్యంలోనేగాక భాషా, గణిత, తర్కాది శాస్త్రాదులలోను ధర్మశాస్త్ర జ్ఞాన మీమాంసాదులలోను ఆయా శాస్త్రానుగుణ పరిభాషా రూపంలో కనిపిస్తుంది. ప్రతీకల విషయంలో సాహిత్యేతర శాస్త్రాలకు, సాహిత్యానికి నిర్దిష్టమైన భేద ముంది. అర్థవైవిధ్యాన్ని గర్భీకరించుకొని వ్యంజనాశిల్ప శోభితాలై అనుభూతి పర్యవసితాలై నిత్యనూతనంగా ప్రకాశించటం సాహిత్య ప్రతీకల స్వభావం. ఏకార్థ భావద్యోతకాలై నిర్దిష్ట వస్తు సూచకాలై, జ్ఞానబోధగమ్యాలై (ఎప్పుడూ మార్పులేనివై) ఉండటం శాస్త్రప్రతీకల లక్షణంగా నిర్దేశించవచ్చు.

అనుభూతికి ఆకరమైన 'అంశం' ఆ అనుభూతి గాఢత వలన అచేతన స్థాయికి చేర్చి దాని భౌతికమైన ఆకృతిని కోల్పోతుంది. ఆ 'అంశం' 'అచేతన'లోని సంస్కారాన్ననుసరించి ప్రతీకగా రూపం దాలుస్తుంది. ఆ ప్రతీక పూర్వరూప వాసనను గర్భీకరించుకొని సశక్తమైన అభివ్యంజన శక్తిని పొందుతుంది. ఇట్లు ప్రతీకకు అచేతన అంతస్సూత్రంగా భాసిస్తుంది.[17] మానవ అస్తిత్వమొక మహావాహిని అయితే లౌకిక అలౌకిక జగత్తులనే దాని రెండు తీరాలను కలిపే పూలవంతెన ప్రతీక.

> "సింబలిజంలో ఒకే వస్తువు ఉంటుంది. దానిలోనే రెండో వస్తువు ఉంటుంది. బయటికి కనిపించేది భౌతికవస్తువు. మామూలు కళ్ళకు కనిపించకుండా లోపల ఉండేది రెండో వస్తువు. అంటే ఒక వస్తువుయొక్క భౌతిక తాత్త్విక రూపాలను కవి గ్రహిస్తాడు. ఒకటి చర్మచక్షువుతో రెండోది జ్ఞానచక్షువుతో" (రక్తరేఖ-శేషేంద్ర. పు.60)

యాంత్రికమైన సాంకేతికతకంటె భిన్నమైనది, అనుభూతి జన్యమైనది. వాచ్యతకంటె సూచన ప్రధానముయినది. వస్తువులను ప్రతీయమానం చేయటంకాక వస్తుతత్త్వాన్ని వ్యక్తీకరించేది ప్రతీక అని నిర్వచించుకోవచ్చు.

ప్రతీక : ఉపమ, రూపకం :

మానవుడెంత బుద్ధిజీవియో అంత హృదయజీవి. వివేచన బౌద్ధిక వ్యాపారం. స్పందన హృదయ స్వభావం. వివేచన విజ్ఞానంగా పరిణమిస్తుంది. స్పందన అనుభూతిగా వికసిస్తుంది. బుద్ధి వస్తుతత్త్వాన్ని వశం చేసుకుంటుంది. హృదయం వస్తు సౌందర్యానికి వశమవుతుంది.

వర్ణాకృతి గుణాల నాశ్రయించి కావ్యబంధంలో ఏదైనా (వస్తు) సాదృశ్యంతో ఉపమితమైనపుడు అది ఉపమ అవుతుందని భరతుని నిర్వచనం. ఉపమానోపమేయత్వానికి యెమైన అర్థద్వయంలో హృద్యమయిన సాధర్మ్యమే ఉపమ నిర్వచించబడింది. సాధారణంగా అలంకారాలన్నీ ఉపమూలకాలే - "సర్వేలంకారే షూపమా జీవితాయతే" అన్నా మహిమభట్టు "ఉపమైకా శైలూషీ సంప్రాప్తా చిత్రభూమి భేదాన్ రంజయతి కావ్య రంగే నృత్యంతీ తద్విదాంచేతః" ఉపమ ఒక నర్తకి చిత్రమయిన భూమికా భేదాలను పొంది కా రంగాన నృత్యంచేస్తూ కావ్యవిదుల చిత్తాన్ని రంజింపజేస్తుం సాధర్మ్య మూలాలైన అన్వయం, ఉపమేయోపమ స్మరణాద అలంకారాలు అభేద ప్రధానాలయిన రూపక, పరిణామ, సందేహ, భ్రాంతి మంతాది అలంకారాలన్నీ ఉపమకు స్వరూప వైవిధ్యాలే. అనేక విచిత్రరూపాలు దాల్చునట్టి ఉపమ అనేకాలంకారాలకు బీజభూతమయింది.

ఉపమేయానికి ఉపమానంతో అభేదాన్నిగాని, తాద్రూప్యాన్నిగాని వర్ణించటం రూపకం. ఉపమా రూపకాలను ప్రయోగించని కవి ఎండడు ఉపమా రూపకాలు లేని శైలి సూర్యుడు లేని పగలువలె, పక్షులు లేని తోటవలె ఉంటుంది అన్నాడు లుకాస్ ''

> ప్రతీక కవినుంచి ఎంత ద్రష్టృత్వాన్ని అపేక్షిస్తుందో అంత ద్రష్టృత్వాన్ని ఉపమ కూడా అపేక్షిస్తుంది. ఉభయత్ర కవిత్వం జ్ఞాన శక్త్యపేక్షికం అయింది. ఉపమాలంకారంలో ఉపమానం తొలుత ప్రతీకగానే స్ఫురించాలి."
>
> (కవిసేన మేనిఫెస్టో పు. 233)

ఉపమ కూడా ద్రష్టృత్వాన్ని అపేక్షించినప్పటికీ అభివ్యక్తిదశలో 'చేతన' (కాన్‌ష్యస్‌నెస్) స్థితి గోచరిస్తుంది. కవి దర్శించిన అంశాలను అదే దార్శనిక స్థాయిలో వ్యక్తీకరిస్తే ఆ ప్రతీకలు అప్రస్తుత వస్తుతత్త్వాన్ని, వాతావరణాన్ని శక్తిమంతంగా ప్రకటిస్తాయి.

"యత్ర ఉపమా నోపమేయాః.........బాయి సాదృశ్యముద్భూత గమొల్లసతి వ్యంగ్యపర్యాదాంవినా స్పష్టం ప్రకాశతే తత్రోపమాలంకారః" వ్యంగ్య పర్యాద లేకుండా స్పష్టంగా కవిత్వ సౌందర్యబోధ కలిగించేది ఉపమ. ఉపమానోపమేయాల సాదృశ్యం ఉపమ రూపకాలలో వాచ్యమవుతుండగా ప్రతీకలో వ్యంగ్యంగా ఉంటుంది. ద్రష్టయొక్క అంతర్మండలంలో ప్రతీక చంద్రరేఖలా తేలుతున్నప్పుడు దానికి ధ్వని స్ఫోరక సౌందర్య శక్తి ఉంది. నిరవధికంగా ఉంది. అప్పుడు ప్రతీకనుంచి శ్రోత ఊహాశాలిత ఎంత తీసుకోగలిగితే ప్రతీక అంత ఇవ్వగలదు. కానీ 'ఇవ' అనే భౌతికబంధం తగిలించేసరికి ప్రతీక ఒక

అభిశప్త గంధర్వుడిలా రెక్కలు కోల్పోయి అంటే తన ధ్వని మహిమ కోల్పోయి ఆకాశమండలంనుంచి భూమండలంమీద పడిపోతుంది." (కవిసేన మేనిఫెస్టో పు. 234) అన్నాడు శేషేంద్ర. ఈ విధంగా ప్రతీక, ఉపమ, రూపకాల ఉద్భవ స్థాన మొకటే అయినప్పటికి అభివ్యక్త స్థితిలో ప్రతీక సమున్నతమైన 'దార్శనిక ప్రక్రియ'గా అవతరిస్తుంది. ఉపమా రూపకాలు 'భౌతిక దృక్ప్రక్రియ'గా మిగిలిపోతున్నాయి.

ప్రతీక : ధ్వని

సాధారణ దృష్టికి ప్రతీక-ధ్వని సమానార్థకాలుగా కనిపిస్తాయి. సూక్ష్మంగా పరిశీలిస్తే వాటిమధ్య నిర్దిష్టమయిన వైవిధ్యం కనిపిస్తుంది.

> "సింబాలిజం డీల్స్ విత్ ది విజన్ ఆఫ్ ది పోయెట్ వేర్ యాజ్ 'ధ్వని' డీల్స్ విత్ ఇట్స్ ఎక్స్ప్రెషన్. విజన్ ఆఫ్ ది పోయెట్ హియర్ ఈజ్ హిజ్ పవర్ బై విచ్ హి సీ ది ఎస్సెన్స్ ఆఫ్ థింగ్స్ అండ్ వాట్ అప్పియర్స్ టు హిమ్ ఆర్ (ఠా) రాదర్ వాట్ హి విజువలైజెస్ ఈజ్ ది సింబల్" (రక్తరేఖ. పు. 181)

తత్త్వదర్శనం ప్రతీక స్వభావం. అర్థాంతర స్ఫూర్తి ధ్వని లక్షణం. వస్తువుయొక్క భౌతిక తాత్త్విక రూపాలను దర్శించి ఆదర్శనజన్యమైన అనుభూతిని తదనుగుణమైన ప్రతీకలలో వ్యక్తీకరించటం ప్రతీక లక్ష్యం.

> "సింబలిస్టు వస్తువుల్లోంచి వాస్తవాన్ని పిండుకుంటాడు సింబలిస్టు వస్తువులో సింబల్ని చూస్తున్నాడు. కనుక ఒక సత్యమే సింబల్ అని వ్యవహరింపబడుతోంది. సింబాలిజంలో సింబల్స్ను ఇష్టమొచ్చినట్లు పెట్టుకునేవి కావు. ఏవో వట్టి గుర్తులు కావు. అది సింబలిస్టు అనే ఒక ద్రష్ట చూసిన దృశ్యాలు ఆ ద్రష్టకు సిద్ధించిన దార్శనిక అనుభూతులు" (రక్తరేఖ. పు. 49)

ప్రతీక ధ్వనిలోని అంతర్భేదమైన సంలక్ష్య క్రమ వ్యంగ్యంలో అంతర్భవిస్తుందని కొందరు విమర్శకులు భావించారు. కాని సంలక్ష్యక్రమ వ్యంగ్యానికి ప్రతీకకు వాచ్యార్థ వ్యంగ్యార్థాలు క్రమంగా స్ఫుటంగా గోచరించటంలోనే సామ్యం. ప్రతీక ఉద్భవకారకమయిన కవిలోని దార్శనికస్థితి పాఠకునిలో పునఃసృష్టిచేసే శక్తి ధ్వనిలో కనిపించదు. ప్రతీక తత్సాధనలో శక్తిమంతమయిన పాత్ర నిర్వహిస్తుంది. అందుకే "అలంకారికులు సాహిత్య పరాకాష్ఠగా చెప్పే ధ్వనికంటె సింబాలిజం చాలా గొప్పది. సింబలిజం ఒక విరాట్ స్వరూపం అయితే ధ్వని దాని పాదంవరకే వస్తుంది. ధ్వని కేవలం శబ్దశక్తి వ్యవహారం. కాని సింబాలిజం దృగ్వ్యవహారం, వైదిక వ్యవహారం" అన్నాడు శేషేంద్ర. (ర.రే. పు. 48.)

ప్రతీక : భావచిత్రం

కావ్యశోభా హేతువులై పాశ్చాత్య సాహిత్య ప్రపంచంలో ప్రచలితమైన కవితాసామగ్రి 'సిమిలీ' (ఉపమ), మెటఫర్ (రూపకం), 'ఆర్కిటైప్' (ఆద్యబింబం) 'అల్లిగరీ' (ప్రతీకాత్మక ప్రబంధం), 'ఇమేజ్' (భావచిత్రం), సింబల్ (ప్రతీక) మొదలైనవి. సహృదయ హృదయమనే భిత్తికపై కల్పనా శక్తి అనే కుంచెతో భావాలను వర్ణాలతో తీర్చే రేఖాచిత్రం వంటిది భావచిత్రం.

> "ఎ పోయెటిక్ ఇమేజ్ ఈజ్ ఎ మోర్ ఆర్ లెస్ సెన్షియస్ పిక్చర్ ఇన్ వర్డ్స్ టు సమ్ డిగ్రీ మెటాఫోరికల్ విత్ యాన్ అండర్టోన్ ఎట్ సమ్ హ్యూమన్ ఎమోషన్ ఇన్ ఇట్స్ కాంటెక్ట్స్ బట్ ఆల్సో చార్జ్డ్ విత్ అండ్ రిలీజింగ్ ఇన్ టు ది రీడర్ ఎ స్పెషల్ పోయెటిక్ ఎమోషన్ ఆర్ పాషన్"[20]

కవిత్వంలోని అనుభూతి గాఢత చిత్రలేఖనంలోని అభివ్యక్తి విస్పష్టత కలసి ఏర్పడిన సమగ్ర కవితాకళ భావచిత్రం. వర్ణసంయోజన సాదృశ్యంలో ఉపమ కనిపించవచ్చు; చిత్రీకరణ సామర్థ్యంలో రూపకం రూపుకట్టవచ్చు; రేఖలు ప్రతీకాత్మకంగా ప్రతిస్పందించవచ్చు; సమగ్రచిత్రం స్వభావోక్తి సమాదర్శం కావచ్చు; అప్రస్తుత విషయాన్ని వ్యంజించవచ్చు. సర్వకవితా సామగ్రిని సమాదరించే సమగ్ర సజీవ కవితా శతపత్రం భావచిత్రం.

భావచిత్రం ప్రతీకాత్మకం కావచ్చు; ప్రతీక చిత్రాత్మకం కావచ్చు. కాని చిత్రాత్మకత భావచిత్రానికి ప్రధాన లక్షణం వ్యంజనా వ్యాపారం ప్రతీక స్వభావం. వీటిలో సామ్యం వైషమ్యం యివె. భావచిత్రంలోని శబ్దాలు సాధారణంగా ఒకే అర్థాన్ని సూచిస్తాయి. కాని ప్రతీకద్వ్యర్థి. ప్రతీకకు భావసూచన ప్రధానం భావంయొక్క సమగ్రరూపాన్ని సమీక్షింపజేయటం భావచిత్ర పద్ధతి.

అవచేతన, చేతనల ఆచ్ఛాదనల మాటునఉన్న అనిర్వచనీయమయిన అనుభూతులను ఆవిష్కరించటంలో ప్రతీక అసమాన పాత్ర నిర్వహిస్తుంధి దృశ్యజగత్తునుండి ఆధిభౌతిక తీరాలకు తీసుకువెళ్ళగలిగింది ప్రతీక. అనుభూతి వ్యక్తీకరణలో ఎక్కడ

సాధారణ భాష విఫలమవుతుందో అక్కడ ప్రతీక కార్యసాధక మవుతుంది.

**సూచికలు :**


1. సుసేన్ కె. లాంగర్; ఫిలాసఫీ ఇన్ ఎ న్యూ కీ. పు. 45.
2. ముదిగొండ శివప్రసాద్; మన పురాణ సంకేతాలు. పు.2.
3 (బొడ్డువల్లి పురుషోత్తం; భాషాశాస్త్ర పరిచయం. పు. 3 నుంచి గ్రహింపబడింది)
4. ఋగ్వేదము. 1-164-20.
5. నిగూఢ వేదరహస్యము. పు. 197.
6 చూ. ఎస్ ఎ. డాంగే : సెక్సువల్ సింబాలిజం ఫ్రమ్ ది వేదిక్ రిచువల్స్. పు. 55.
చూ. డోరిస్ శ్రీనివాసన్; కాన్సెప్ట్ ఆఫ్ కౌ ఇన్ ది ఋగ్వేద. పు. 117
7. అరవిందుడు. గీతావ్యాసములు.1. పు 130.
8. అన్నపూర్ణోపనిషత్తు. 1-28.
9. తైత్తిరీయోపనిషత్తు. 1-8-1
10. యం. హెచ్. అబ్రహాం : ఎ గ్లోసరీ ఆఫ్ లిటరరీ టర్మ్స్. పు. 51.
11. ఎల్. కిజామెన్; ఎ హిస్టరీ ఆఫ్ ఫ్రెంచ్ లిటరేచర్- పు. 379.
12. సి. మ్. బౌరా. ది హెరిటేజ్ ఆఫ్ సింబాలిజం. పు. 1.
13. ఎ హిస్టరీ ఆఫ్ ఫ్రెంచ్ లిటరేచర్. పు. 382.
14. కె. వి. ఆర్. నరసింహం : ఆధునికాంధ్ర కవితా సమీక్ష. పు. 78.
15. ఎన్సైక్లోపిడియా ఆఫ్ రిలీజియన్ అండ్ ఎథిక్స్-12 పు. 833.
16 డబ్ల్యు. యం. అర్బన్ : లాంగ్వేజ్ అండ్ రియాలిటీ. పు. 404.
17. విలియం. వై. టిండాల్ : ది లిటరరీ సింబల్, పు. 346.
18 అప్పయ్య దీక్షితులు : చిత్రమీమాంస. పు. 6.
19. సిమిలీ అండ్ మెటఫర్ : స్టైల్. పు. 192.
20 సి. డి. లెవిస్ : పోయెటిక్ ఇమేజ్. పు. 22.


# సుప్తశిల

## శ్రీ జి. వి. సుబ్బారావు

కిల కిలా నవ్వింది
కలికి వెన్నెల తీవలా!
గల గలా పారింది
చెలియ సెలయేరులా!
మిల మిలా మెరిసింది
మెలత శంపాలతలుగా!
అది
శుభ్రజ్యోత్స్నా పులకిత యామిని!
అది
వినూత్న భావోద్దీపిత ప్రతిభా తరంగిణి!!
అది
భారతాంబ వీథీ విహార స్వతంత్రభామిని!!
తప్పటడుగులతో
శైశవం గడిచింది!
గొప్ప ఆశాలహరితో
యౌవన మధురప్రాంగణంలో అడుగిడింది!
అంతే-
ఉప్పెనలా
కామసహస్రాక్ష వీక్షణం!
ముప్పిరిగా
సంప్రదాయ తపోనియమ కటాక్ష !
యామినీ హృదయంలో
తీవ్ర సంఘర్షణ!
సంరక్షకుల నయనాలలో
ఆక్రమాన్వేషణ!
అది
అధికార గౌతమ శాపాగ్నిలో శలభం!
అది
అనధికార దేవేంద్ర వాంఛాగ్ని కింధనం!
అందుకే
పాపం!-సుప్తశిల!!-
అహల్యారూప
ప్రజాస్వామ్యం!!!-

# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్టమైన ఆముదము




శుద్ధి
చేసినది,
వాసన
లేనిది.

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004

**Amrutanjan Limited** 



755-TG

# తృషావర్తం

## శ్రీ సోమసుందర్

కవితానుభూతుల వికీర్ణారణ్యాలు దాటి
ఐకాంతిక గుహావరణల్లో
చేతులుచాచి తడుముకుంటూ
తనచుట్టూ తానే తిరుగుతోంది మేధ....
సూర్యుణ్ణి దాచేసిన మకరంలా
ఆ వాఙ్మానస గోచర గోస్తనీనది
దాచేస్తోందర్భక హృదయాన్ని....
పదేళ్ళకే యౌవనం ఆవహించిన
విచిత్రపురుషుడు
ఏభయ్యేళ్ళ యౌవనావిర్భావం కాని
వికృత స్త్రీతో
ఆబగా సంగమిస్తున్న సమయంలో
విడ్డూరంగా వినిపించే మణితం
అక్షరబద్ధమవుతోంది....
ఈ సుందర సీతాకోకచిలుక గర్భాన్ని
చీల్చుకొని-
ఎంత భయంకర జుగుప్సాకర
గొంగళీపురుగుల సమూహం
అవతరించనున్నదో సందేహమే!
భావనానుభవ భీతావహం నన్ను
అడుగడుగునా ప్రకంపింపచేస్తోంది....
కలల మసాళా దినుసులూ
కవితల సుగంధద్రవ్యాలూ
రహస్యాక్షర మూషికాళి మింగేసి
సిలుకు రుమాళ్ళతో
మూతులు తుడుచుకుంటున్న దృశ్యం-
నీ కన్నుల ఎదుట బాహాటంగా....
సంగీత పంజరంలో
కిల కిలలాడుతున్న అపస్వరాలు
రాకాసి చెట్ల తలలపై
మంటలు కక్కే కుంపట్లు
దిక్కూ తెన్నూ తోచక
ఈతచెట్టు క్రింద జుత్తు విరబోసుకొని
బోరున ఏడుస్తున్న వెన్నెల చానలు
మోకాలి బంటి పచ్చికలో
బుసలు కొట్టే మిణ్ణాగుల
పురాస్మృతులు....
కవితాకాశంలో
ఎన్నెన్ని మిథ్యాబింబాలు?
ఎన్నెన్ని తృషావర్తాలు!
ఎన్నెన్ని ఒహో! నైరూప్యచిత్రాలు?
ఎన్నెన్ని ఉద్వేగ్న భగ్న కామనలు!
కాంతికిరణాల హరిణ కిశోరాలను
మింగేసిన నంగనాచి కొండచిలువలు
అనంతావర్తాల రుచిర నాదాలలో
అలలై కలలై తేలుతూ నిట్టూర్పులు
తృణాధారమైనా దొరక్క
బిక్కచచ్చిన జలగండాలు....

# చితిమీది బతుకులు

## శ్రీ కొచ్చెర్లకోట వెంకట సుబ్బారావు

శరభయ్య మూడో అగ్గిపుల్ల గీశాడు. సగం ఆరిపోయిన చుట్టను మళ్లీ వెలిగించాడు. కానీ అది ఆరిపోయింది. 'పాడు వాన' అని గొణుగుతూ మరో పుల్ల తీశాడు. అదీ వెలగలేదు. విసుగొచ్చి చుట్ట విసిరేశాడు.

రెండు అరచేతులు గట్టిగా రుద్ది కళ్ళు మూసుకుని రెప్పలపై అద్దుకున్నాడు. కొంచెం చురుక్కుమంది. మత్తు వదిలింది. కడుపునిండా తిన్నవాడికి మత్తే, కడుపులో ఏమీ పడకపోయినా మత్తే. మూడు రోజులుగా ధారాపాతంగా కురుస్తున్న వాన తగ్గుముఖం పట్టలేదు. శరభయ్యకు ఒక్క గిరాకీ తగలలేదు. పొయ్యిలో పిల్లి లేవలేదు.

'ఎప్పుడు తగ్గుతుందో ఈ వాన' అనుకుంటూ గుడిసె గుమ్మంలో తలపెట్టి ఆకాశంవంక చూశాడు. 'లాభంలేదు. మబ్బులు దట్టంగా కమ్మాయి. సాయంకాలమైనా తెరపియిస్తుందో లేదో' లోపల అనుకుందామనుకుని బయటకు అనేశాడు.

అయినా అతని ఆశ కానీ యింత వర్షంలో ఎవరు మాత్రం వస్తారు? కట్టెలు కాలొద్దూ? కట్టెలు కాలితేగానీ కట్టె కాలదు. కట్టెలు కాల్చటమే శరభయ్య వృత్తి. కాట్లో కట్టె కాలితే ఇంట్లో పొయ్యి వెలుగుతుంది.

తరతరాలుగా వస్తున్న వృత్తి ఇది. ఎంత వద్దనుకున్నా శరభయ్యకూ తప్పలేదు. చదువుకున్నవాళ్ళకే ఉద్యోగాలు రాని ఈ రోజుల్లో తనలాంటివాడికి ఏం దొరుకుతుంది? ఎన్నోసార్లు తను ఈ వృత్తి మానేద్దామనుకున్నాడు. కానీ ఇది కూడా మానేస్తే పొట్ట గడవటం ఎలా? కొడుకునైనా మంచి ఉద్యోగస్థుణ్ణి చేద్దామని తను పస్తులుండి వాడికి ఫీజులు కట్టాడు. అయినా వాడు చదివిన పదో తరగతికి ఏం ఉద్యోగం వస్తుంది? ఉద్యోగం రావాలంటే సిఫార్సు లుండాలిట! తనని చూస్తేనే మొహం తిప్పేసుకునే పెద్దమనుషులు సిఫార్సులేం చేస్తారు? వయసొచ్చిన కొడుకు జులాయిలా తిరగలేక తండ్రికి సాయం చేస్తానంటాడు. కానీ తనే వద్దంటాడు. అమ్మో! ఒకసారి ఈ వృత్తిలో దిగితే వాడు తనలా అయిపోడూ!

కాస్త తెరిపి యిచ్చింది. ఎక్కడ్నుంచో ఒక కుక్క వచ్చింది. స్మశానంలో అటూ యిటూ తిరుగుతూ బూడిదను తన ముందు కాళ్ళతో పెళ్లగిస్తోంది. పిచ్చిది. స్మశానంలో ఏం దొరుకుతుంది, బూడిద తప్ప! దానికీ తనకులాగే ఆకలిగా ఉండి వుంటుంది. ఇక్కడ పచ్చి ఎముక కూడా లేదాయే. దాన్ని కసిరి కొట్టాడు. అది 'కుయ్యో' అంటూ రెండు కాళ్ళమధ్య తోకవుంచి అక్కణ్ణుంచి ప్రక్కకిపోయి మరోచోట వాసన చూస్తోంది.

'పొద్దుననగా వెళ్ళినవాడు ఇంకా రాలేదేమిటబ్బా' అని మరోసారి అనుకున్నాడు. 'వాడికీ బేరాలు దొరికిఉండవు. ఏం చేస్తాడు? ఒట్టి చేతులతో రాలేక ఏవో తంటాలు పడుతూంటాడు.' కొడుకుని తలచుకుని అనుకున్నాడు శరభయ్య.

ఏమిటో పాడు బ్రతుకులు! శవాలమీద బ్రతకాల్సి వస్తోంది. అందరిలా తనూ 'పదిమందీ చల్లగా ఉండాలి' అనుకోలేడు. అలా అనుకుంటే తన బతుకే లేదు! ఒక విలువా సలవా లేని బతుకులు. తనకన్నా డాక్టర్లే నయం. కొంతమందినైనా ప్రాణాలతో తిరిగి పంపగలుగుతారు. ఇక్కడకొచ్చినవాడు మట్టిలో కలిసిపోవాల్సిందే. ఇక్కడికి ఒక్కళ్లూ నవ్వుమొహంతో రారు. ఏడుస్తూనే వస్తారు. ఎంత యిష్టం లేకపోయినా ఆ మొహాలు చూడక తప్పదు, మాట్లాడకా తప్పదు.

ఈ వృత్తి మొదలెట్టిన దగ్గర్నుంచి ఎంతోమందిని చూశాడు. అందరికీ తనతో అవసరం ఉంటుంది. అయినా ఎవ్వరూ హాయిగా పలకరించరు. పోనీ పబ్బం గడుపుకునేందుకైనా యిచ్చగాలుగా మాట్లాడరు. ఇదే మరోచోటు అయితే యిలా ఉంటుందా? చప్రాసీనైనా మెచ్చుకోలుగా చూస్తారు. చిన్న సాయం చేస్తే కొద్దో గొప్పో సంతోషంగా యిస్తారు. అథవా యివ్వకపోయినా దబాయించి తీసుకుంటారు. కానీ తన విషయం అలా కాదే!

ఒకసారి ఎవరో సంపన్నుడు మరణించాడు. ఎంతో అట్టహాసంగా ఊరేగిస్తూ తీసుకువచ్చారు. మంచి గంధం చెక్కలతో దహన సంస్కారాలు చేశారు. నెయ్యి ధారాపాతంగా వాడారు. అయ్యో ఎంత నెయ్యి వృథా అయిపోతోందో అని తను బాధపడ్డాడు. జీవితంలో తను నెయ్యి రుచి ఎలా ఉంటుందో చూచి ఎరుగడు. అప్పుడు మాత్రం వాసన చూశాడంతే! డబ్బాలకు డబ్బాలు మంటల్లో నెయ్యి గుమ్మరిస్తూంటే ప్రాణం ఉసూరుమంది. కాస్తంత మిగుల్చుకుని రుచి చూద్దామనుకున్నాడు. కానీ మొహమాటపడ్డాడు. అడగలేక అలానే మంటల్లో గుమ్మరించాడు. దాంతో తన కోరిక కూడా బుగ్గిపాలయింది.

కార్యక్రమం ముగిసిన తర్వాత ఎక్కడివాళ్లు అక్కడ వెళ్ళిపోతున్నారు. వాళ్ళలో కాస్త ఘరానాగా వున్న ఓ వ్యక్తిని తను అనుసరించాడు. అతడు ఏమిటన్నట్టు తనవంక చూశాడు. 'ఏదో తమ దయ' అంటూ తను చెయ్యి చాచాడు.

"ఇందాకే యిచ్చాంగా? మళ్ళీనా?" అని అతని ప్రక్కనున్నవాడు గద్దించినట్టు అన్నాడు.

"ఎప్పుడోగానీ తమలాంటి గొప్పోళ్ళు యిక్కడికి రారు. ఇలాంటి సమయాల్లోనైనా తమరు కాస్తంత పెద్దమనసుతో మాలాంటివాళ్ళను చూడాలి." అన్నాడు. అసలు ఎలా అనాలో తెలియక పొగిడినట్టు అంటే బాగుంటుందేమోనని తను అలా అన్నాడు.

ఆ ఘరానామనిషి కస్సుమంటూ లేచాడు.

"సమయం సందర్భం ఉండక్కర్లే? ఎక్కడ పడితే అక్కడ పీడించుకు తినటమేనా? గంపెడు దుఃఖంతో మేముంటే శనిలా వెంబడిస్తావా? పైగా మాలాంటివాళ్లు ఇక్కడికి ఎప్పుడూ రావాలా?"

శరభయ్య మనస్సు చివుక్కుమంది. తను యిప్పుడు ఏం తప్పు చేశాడు? ఇక్కడ కాకపోతే మరెక్కడ అడుగుతాడు? బయట తన మొహం కనబడితేనే అశుభం అనుకుంటారు. అందుకే ఎంత పనివున్నా ఉదయమే బయటకు రాడు తను. ఎదురు వస్తే వెనక్కు తిరిగి వెళ్ళిపోతారు. తనదీ ఒక బతుకే!

శరభయ్యకు చిన్నప్పుడే వేదాంతం అబ్బింది. అంత మాత్రాన అతడు గ్రంథాలు చదివినవాడు కాదు. లోకాన్ని చదివాడు. తను పెరిగిన వాతావరణం కూడా అందుకు సహకరించింది. ఇక్కడకు వచ్చిన ప్రతివాడూ వేదాంతం మాట్లాడేవాడే! వద్దనుకున్నా వారి మాటలు అతని చెవిన పడతాయి. జీవితం ఎంతో నిస్సారమని, ఎలా వచ్చారో అలానే పోతారనీ, వెంట వచ్చేది ఏమీ లేదని ఏవేవో అంటూంటారు. ఎందుకో ఆ మాటలు నిజం కాదనిపిస్తాయి శరభయ్యకు. కారణం యిదీ అని చెప్పలేడు. ఇన్ని మాటలు విని తను ఏం మారాడని? అన్నవారు మాత్రం మారుతున్నారా? అందుకే యిదంతా వ్యర్థప్రసంగం అనిపిస్తుంది. వినీ విననట్టు వదిలేస్తాడు. ఈ ప్రపంచం మొత్తాన్ని ఆకలి తీరినవాడు తనచుట్టూ తిప్పుకుంటున్నాడు. తను మాత్రం ఆకలిచుట్టూ తిరుగుతున్నాడు. ఇదీ శరభయ్య బుద్ధెరిగిన విషయం.

ఇక్కడకి వచ్చేవాళ్లు అందరూ ఒకే మాదిరిగా ఉండరు. కట్టెకు నిప్పు అంటించగానే కొంతమంది దూరంగా వెళ్ళి కూర్చుంటారు. బీడీలు కాల్చుకుంటూ ఏవో లోకాభిరామాయణం మాట్లాడుకుంటూ ఉంటారు. 'ఎండ చెత్తరేగిపోతోందే' అనే దగ్గర్నుంచి దేశ రాజకీయాలవరకు మాట్లాడుతుంటారు. వాదోపవాదాలు చేసుకునే సందర్భాలు కూడా లేకపోలేదు. మరికొంత మంది పోయిన వ్యక్తిగురించి ఎంతో గొప్పగా చెప్పుకుంటూంటారు. ఎంతో దానశీలి అనీ, అడిగినవాడికి లేదు అనలేదనీ ఏవేవో చెబుతూంటారు. ఆ మాటలన్నీ చిత్తశుద్ధితో అనే మాటలే అని మొదట్లో తను భ్రమపడ్డాడు. కానీ అందరూ అనటం విని మర్యాదకోసం అంటూంటార్లే అని క్రమంగా అర్థమయింది.

ఒకసారి ఓ విచిత్రం జరిగింది. ఒక వ్యక్తి రిక్షాలో శవాన్ని వేసుకువచ్చాడు. కట్టెలకు కూడా అతనిదగ్గర డబ్బుల్లేవు. అతడే హత్యచేసి గుట్టుచప్పుడు కాకుండా దహనం చేయటానికి వచ్చాడేమోనని తనకి అనుమానం కలిగింది. కానీ అతని మాటలు విన్న తర్వాత అలాంటిదేమీ కాదు అని నిర్ధారణ అయిపోయింది. అతనిమీద ఎంతో జాలి కలిగింది. అయినా తనేం సాయంచెయ్యగలడు? కట్టెలు తేవటం మాటలా? అందుకే ఖననం చెయ్యటానికి గొయ్యి తవ్వి పెట్టి - తనకి చేతనయిన సాయం చేశాడు.

శరభయ్య జీవితంలో ఎన్నో ఢక్కాముక్కీలు తిన్నాడు. పోలీసు కేసులు, శవాలను తవ్వి తియ్యటాలు, ఆరాలు తీయటాలు ఎన్నో తన జీవితంలో చూశాడు. అందుకే తను ఎంతో అనుభవం గడించాడు. మనిషి అసలు స్వరూపం తెలుసుకోవటం కష్టమని, ప్రాణికోటిలో బొత్తిగా అర్థంకాని ప్రాణి మనిషే అని అతడు ఓ నిర్ణయానికి వచ్చాడు.

ఆలోచన్లు ఎంతకూ తెగటంలేదు శరభయ్యకు. రిక్షా తొక్కి నాలుగు డబ్బులు పట్టుకు వస్తానంటూ వెళ్ళిన బిడ్డ

ఎంతకీ రావటంలేదు. శరభయ్య ఏమీ తోచక అటూ యిటూ పచార్లు చేస్తున్నాడు. కాస్సేపటికి దూరంగా ఓ రిక్షా రావటం కనిపించింది. ఎవరూ యిటు వంటరిగా రారు. అలా వచ్చేది కొమకే అని నిర్ధారించుకున్నాడు.

శరభయ్య కొడుకు ఎంతో హుషారుగా వచ్చాడు. బేరాలు గిట్టాయేమోనని అతడు సంబరపడ్డాడు. కానీ రోజంతా వర్షం. బేరాలెలా దొరికాయా అని ఆశ్చర్యంగా ఉంది.

"నాన్నా! మనకో మంచి అవకాశం దొరికింది. తాశీల్దారు ఆఫీసులో పనిచేసే అటెండరు పోయాడు. ఆ పోస్టు మన కేమైనా యిస్తారేమో వీలు చూసుకుని నువ్వు అడుగు. శవం వెంట తాశీల్దారు కూడా ఇక్కడకి వస్తున్నాడు." అంటూ సంబరంగా అన్నాడు.

శరభయ్య గతుక్కుమన్నాడు. చచ్చినవాడి కట్టె యింత బూడిద కాకమునుపే బతికి ఉన్నవాడు అతని స్థానం ఆక్రమిద్దామని ఎంత తాపత్రయపడతాడు? స్మశానంలో సిఫార్సు చేయమని అడగటమా?

అంతా అయిపోయి, శవంవెంట వచ్చినవాళ్ళంతా తిరుగుముఖం పట్టారు. శరభయ్య చేతులు కట్టుకుని తాశీల్దారువెంట నడుస్తున్నాడు. ఆయన అతనివంక ఓసారి చూసి ఏమనుకున్నాడో ఏమో - జేబులోంచి ఓ పది రూపాయలనోటు తీసి అతనికి యివ్వబోయాడు.

అపచారం అన్నట్టు చెంపలు వాయించుకుని "వద్దయ్యా! తమకాడ ఈ పది రూపాయలు తీసుకుంటే మాత్రం నా దరిద్రం తీరతదా?" అన్నాడు వినయంగా.

"మరి?" ఇంకో పది కావాలా అన్నట్టు ఆయన జేబులో చెయ్యి పెట్టబోయాడు.

"అయ్యా! వద్దయ్యా! నాకేం డబ్బులొద్దయ్యా, తమ దయ ఉంటే - ఓ సాయం జెయ్యండయ్యా. బతికి వున్నంత కాలం తమ పేరు చెప్పుకుంటాను."

నడుస్తున్నవాడల్లా ఆగి "ఏంటి? చెప్పు - వీలైతే చేద్దాం!" అన్నాడు.

శరభయ్య జంకుతూనే అన్నాడు - ఏమనుకోకండయ్యా! కడుపు కక్కుర్తికొద్దీ అడుగుతున్నాను. మా పిల్లోడు పదిదాకా చదివాడు. తమ ఆఫీసులో ఉద్యోగమేదైనా-అంటూ నసిగాడు.

తాశీల్దారు నొచ్చుకుంటూ "అబ్బే - ఖాళీలేం లేవయ్యా! వచ్చినప్పుడు చూద్దాం. మీవాణ్ణి ఓసారి వచ్చి కన్పించమను." అన్నాడు.

"మరి - పోయినోడి ఖాళీ—" అంటూ శరభయ్య మళ్ళీ నసిగాడు.

తాశీల్దారు అదోరకమైన విరక్తిగా నవ్వాడు—" ఇందాకానా? శవాన్ని ఎత్తకమునుపే ఎవరో అప్లికేషను తెచ్చారు. ఆర్డరు కూడా వేసేశాను. ఇక యిప్పుడేం చేసేది లేదయ్యా. అయినా ఇలాంటి విషయాలలో కాస్త ముందుచూపు ఉండాలి." అంటూ ఆయన వెళ్ళిపోయాడు.

శరభయ్య నిశ్చేష్టుడై నిలబడిపోయాడు. మనిషి మంచాన పడగానే అతడు పోతాడని నిర్ధారించుకుని అర్జీ తయారుచేయించి శవాన్ని ఎత్తకమునుపే ఆర్డరు వేయించుకోగలిగిన సమర్థులు ఉండగా తనకు ముందుచూపు ఎలా ఉంటుంది? తను ముందుకు ఎలా పోతాడు? తనలాంటివాళ్లు ఎప్పుడూ వెనకబడ్డవాళ్ళే!

---

# శవ 'సంస్కారం'

**శ్రీ మణిగోపాల్**

ఈ శవాన్ని పేలవంగా చూడకు
శైశవంలోనే చురుకుదనం చూశాన్నేను
మూసుకున్న ఆ రెప్పల వెనుక
ముప్పిరిగొన్న అగ్నిగోళాల్ని చూశాన్నేను
చచ్చుబడ్డ ఆ చేతుల వెనుక
చావగొట్టే పిడికిళ్లను చూశాన్నేను
అలసిపోయిన ఆ గళం వెనుక
అధికారుల జులుం అణిచెయ్యడం చూశాన్నేను
నడవలేని ఈ కాళ్ల కింద
నలిగిపోయిన అవినీతిని చూశాన్నేను
వడలిపోయిన ఆ శరీరం వెనుక
వంచన వెన్ను విరగ్గొట్టడం చూశాన్నేను
చివరికీ చితిమంటల్లో సైతం
చివాలున ఎగజిమ్మే చిచ్చరపిడుగుల్ని చూస్తున్నాను.

శ్రీ నాయని సత్యనారాయణరావు

# పాలమాచాపురి - కనకజంభనపురి

పల్నాటి వీరచరిత్రలో అనుగురాజు (అలుగురాజు) పాలమాచాపురి పట్టణమునుండి వచ్చినట్లు చెప్పబడినది. ద్విపద కావ్యములో

"అరయ లోకమ్ముల కాధారమనగ
ధరణీదేవికి ముఖ దర్పణమ్మనగ
పాలమాచాపురి పట్టణం బొప్పు"

అని ఆ పాలమాచాపురి ఎచ్చటిదో తెలుపలేదు. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు తమ ఆంధ్రుల చరిత్రలో. ఉత్తర హిందూస్థానమున పాలమాచాపురి యను పట్టణము గలదనియు, దానికి కనకజంభనపురమను నామాంతరము గలదనియు, దానిని అనుగురాజేలు చుండెననియు వ్రాసిరి. ఇతర గ్రంథములలో పాలమాచాపురి, కనకజంభనపురి, వింధ్య సానువులలోని చేది దేశములోనివని వ్రాయబడినది. చేదిదేశము విదర్భ దేశము నానుకొనియుండు పురాణ ప్రసిద్ధమైన దేశమైయున్నది. పరిశోధకులు చేది దేశములోని జబ్బల్‌పూరును కనకజంభనపురిగా గుర్తించిరి కాని పాలమాచాపురి ఎచ్చటనున్నదో నిర్దేశింప జాలరైరి.

పల్నాటి వీరచరిత్ర ఆంధ్రదేశమున పల్నాడులో షుమారు 50 సంవత్సరముల కాలములో కుటుంబములో సవతి సోదరుల మధ్య జరిగిన చిన్న యుద్ధమైయున్నను మహాభారత యుద్ధముతో పోల్చుచు గ్రంథరచన సాగినట్లున్నది.

ఆంధ్రదేశమున విదర్భ, చేది మండలములు పాత గుంటూరు జిల్లాలోనున్నట్లు విశదమగుచున్నది. కొండవీడు కుండినపురముగాను కొండవీటిసీమ అనగా నరసరావుపేట, గుంటూరు, సత్తెనపల్లి, బాపట్ల తాలూకాలు విదర్భ దేశముగాను ఉదహరింపబడియున్నది. ప్రోలయ వేమారెడ్డి క్రీ.శ. 1340 నాటి మంచాళ్ల శాసనములో "నరాజధానీం జగతి ప్రసిద్ధాం, శ్రీ కుండినీనామ పురీమతిష్ఠత్" అని కుండిన నగరమును కొండవీడుగా నుదహరించెను. చాలకాలమునుండి ప్రచారములో నున్న చింతలపాటివారి పంచాంగములోని శ్లోకములో కొండవీడును కుండినపురమని వ్రాసిరి. శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారి "ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము"లో వాసిరెడ్డి వెంకటాద్రినాయుడుగారి ప్రతిష్ఠల గురించి వ్రాసిన పద్యములో

"మేటి బాపట్ల గుంటూరు మోటుపల్లి
చింతపల్యాది కుండినసీమ కొన్ని
యూళ్ల నేతత్ప్రతిష్ఠగా నొనరజేసె
నతడు శ్రీ వేంకటాద్రిచంద్రుడతుల యశుడు"

అని కుండినసీమ పేర్కొనబడినది. కావున విదర్భ నేటి గుంటూరు, నరసరావుపేట, సత్తెనపల్లి, బాపట్ల తాలూకాలు గల ప్రాంతమైయున్నది.

ఉత్తర హిందూస్థానమున విదర్భ దేశము నానుకొని చేది దేశము కలదు. అటులనే మన ఆంధ్రదేశమున కూడ విదర్భ మండలమునానుకొని చేది మండలమున్నది. ఈ చేది మండలమును తిక్కన తన నిర్వచనోత్తర రామాయణములో పేర్కొని యున్నాడు. మనుమసిద్ధి తండ్రి తిక్కరాజుయొక్క విజయములను కూర్చిచెప్పుచు వానిలో

"శైశవ క్రీడనాడు పటు శౌర్య దురంధరబాహుడైన పృ
ద్వీశ నరేంద్రు మస్తకము నేత్తైర కందుకకేళి సల్పడే"

"అకుమయ గురుము లూరికి నెత్తివచ్చిన
కొనడె యాహవమున ఘోటకముల
దర్ప దుర్జయులగు దాయాద నృపతుల
నసిలోన బరపడే యాగ్రహమున
శంబురాజాది ప్రశస్తారి మండలి
కము జేర్చి యేలడే కంచిపురము.
చేది మండలము గాసిగ జేసి కాళవ
పతినియ్యకొలుపడే పలుచముగా."

"కమలాప్త ప్రతిమానమూర్తియగునా కర్ణాట సోమేశు దు
ర్ద మదోగ్గర్వము రూపుమాపి నిజదర్పంబున్ ప్రతిష్ఠించి లీ
ల మెయిన్ చోళుని భూమిపై నిలిపి చోళ స్థాపనాచార్య నా
మము దక్కంగొని తిక్కభూవిభుడు సామర్థ్యంబు చెల్లింపడే."

పై పద్యములలో చేది మండలముతో కాళవపతి నోడించి నట్లు వ్రాయబడినది. 'కాళవపతి', కాడవపతికి పొరబాటు. కాడవపతి అనగా మహారాజసింహుడను పల్లవరాజు. అతనినే అరవలు కొప్పెరుంజింగడందురు. ఇతని దానశాసనములు క్రీ.శ. 1243 మొదలు 1279 వరకు కనుపించుచున్నవి. తిక్కరాజు క్రీ.శ. 1210లో పృధ్వీశ్వరుని చంపినది మొదలు క్రీ.శ. 1234 వరకు అతని దానశాసనములు కనుపడుచున్నవి. కావున తిక్కరాజు కొప్పెరుంజింగని యుద్ధములో నోడించినాడని చెప్పుట సరి గాదేమో కొప్పెరుంజింగడు రుద్రమదేవి రాజ్యమునకు వచ్చిన క్రొత్తలో అనగా క్రీ.శ. 1260 నాటికి ఆంధ్రదేశమున తన సైన్యములతో తిరుగుచు యుద్ధములలో పాల్గొనుచున్నట్లు విశద మగుచున్నది. కావున నిర్వచనోత్తర రామాయణములోని 'కాళవపతి' పరిష్కర్తల పొరపాటుగాని అచ్చుతప్పుకాని కావచ్చును. 'సేవణపతి' అసలు పాఠమై యుండును. పై విషయమును బలపరచు కేతన దశకుమార చరిత్రలో తిక్కరాజును గూర్చి చెప్పిన

"బలిమిచే పృధ్వీశు తలద్రుంచె సేవణ
కటక సామంతుల గర్వమణచె
ద్రవిళమండలి కులందర దక్కనేలె చో
డని నిజ రాజ్యపీఠమున నిలిపె
కర్ణాటవిభు నహంకారంబు మాన్పించె
పాండ్యునిచేత కప్పంబు గొనియె
నేరువ మన్నీల నెరిపుట్టగానేలె
వైరి వీరుల నామ లూరనోర్చె."

పై పద్యములో కాళపపతియైన మహారాజసింహుని ప్రసక్తి లేదు. దానికి బదులు సేవణ కటక సామంతుల గర్వమణచినట్లు చెప్పబడినది. సేవణ కటక సామంతుడనగా సేవణ దేశము నుండి వచ్చిన కళ్యాణ కటక పశ్చిమ చాళుక్య సార్వభౌములకు సామంతులని యర్థము. ఆరవ విక్రమాదిత్యుడు క్రీ.శ. 1118లో వేంగీ దేశముపై దండెత్తినప్పుడు అతని సేనానులు కొందరు ఆంధ్రదేశములో చిన్న చిన్న రాజ్యాలేర్పరచుకొని కొంతకాలము పాలించిరి. అట్టివారిలో అద్దంకి రాజధానిగ రాజ్య మేలిన సేవణరాజులు మనకు శాసనములలో కనుపించుచున్నారు. క్రీ.శ. 1208నాటి మణికేశ్వరం శాసనములో శ్రీమన్మహామండ లేశ్వర మాధవ మహారాజు అద్దంకి రాజధానిగా ప్రస్తుత ఒంగోలు, అద్దంకి మొదలగు తాలూకాలు ఏలుచున్నట్లు కనుపడు చున్నది. తరువాత క్రీ.శ. 1236నాటి యెండ్లూరు శాసనములో ఈతడు కాకతీ గణపతిదేవుని సామంతుడుగా కనుపించు చున్నాడు. మణికేశ్వరం ప్రస్తుత అద్దంకి తాలూకాలోను యెండ్లూరు ప్రస్తుత ఒంగోలు తాలూకాలోను గలవు.

మాధవ మహారాజు తరువాత నతని కుమారులు సింగళ దేవుడు, సారంగపాణి రాజ్యమేలినట్లున్నది.

నిర్వచనోత్తర రామాయణములోని

"శృంగారంబు నలంగ దేమియును ప్రస్వేదాంకుర శ్రేణిలే
దంగంబుల్ మెరుగే దవించుకయు మాహారాష్ట్రి సామంతు సా
రంగున్ దోలి హయంబు గైకొనిన సంగ్రామంబునన్ త్వత్తస
ప్తాంగస్ఫార యశుండు మన్మవిభుడంపై చన్న సైన్యంబునన్"

పద్యములో మనుసుసిద్ధి సారంగు నోడించినట్లు చెప్పబడినది. కావున తిక్కరాజు యుద్ధమున నోడించినది మాధవ మహారాజు కావచ్చును. కేతన పద్యములో సేవణ పదము కాళవ పదమునకు పొరపాటైయుండుననుట కాస్కారము లేదు. ఏలనన నతడు కటక సామంతుడని చెప్పియున్నాడు. ఇద్దరు సమకాలీనులగు కవులు చెప్పినది ఒక్కరిని గురించియే యని తలంచినచో సేవణ కటక సామంతుడేలుచున్నది చేది మండలమని ఏర్పడును.

ఈ చేది మండలము ప్రస్తుత ఒంగోలు, అద్దంకి తాలూకాలై యున్నది. అది పైన పేర్కొన్న కుండినసీమ (విదర్భ) నానుకొనియున్నది. ఈ చేది దేశము తిక్కరాజు రాజ్యమునకు సరిహద్దులోనిదై అతనికిని సేవణపతికిని యుద్ధము జరిగియుండవచ్చునని నిర్వచనోత్తర రామాయణము, దశకుమార చరిత్రలోని పద్యములు చెప్పుచున్నవి.

అనుగురాజు వింధ్య సానువులలోని చేది దేశమునేలు రాజై యుండినచో అతనివెంట తీర్థయాత్రకు బయలుదేరినవారి పేర్లన్నియు ప్రస్తుత ఒంగోలు, గుంటూరు జిల్లాలలోని తెలుగు వారు ఆ రోజులలో పెట్టుకొనియుండు పేర్లను పోలియుండజాలవు. "దొడ్డనాయుడు, పెద్దన్న, పేర్నీడు, దోర్నీడు, తెప్పలినాయడు, ముంకర్తి, కన్నమనీడు" మొదలగునవి.

ప్రస్తుత ఒంగోలు తాలూకా చేది మండలములోనిదైన యడల ఇప్పుడు 'రావర్ల మాభవరం' అను గ్రామములు అప్పటి పాలమాచాపురి కావచ్చును. రావర్ల మాచవరం గ్రామములమధ్య దూరం రెండు ఫర్లాంగులకంటె ఎక్కువ యుండదు.

దానికి తూర్పున నాలుగు మైళ్ళలో కనుపర్తియను ప్రాచీన గ్రామము కలదు. ఈ కనుపర్తిని కనకాపురి యనియు, కనకజంభనపురి యనియు పూర్వ కాలమున పిలుచుచున్నట్లు

వాడుక గలదు. కనుపర్తిలో నిప్పుడు పురాతత్వ శాఖవారు త్రవ్వకములు ప్రారంభించనున్నట్లు వినుచున్నాము. కనుపర్తి లోను, మాచవరములోను చెన్నకేశవస్వామి ఆలయములు ఇప్పటికిని కలవు.

పలనాడులో నిప్పటికి మూడు ప్రాచీన శాసనములు కనుపడుచున్నవి. మొదటిది మాచర్ల ఆదిత్యేశ్వరాలయములోని చాగి బేతరాజుగారి క్రీ॥శ॥ **1111**నాటి శాసనము. అప్పటికి మాచెర్లలో చెన్నకేశవాలయము లేదు. పై శాసనములో చాగి బేతరాజునకు అనుంగు కామరాజు, బిరుదుం గామరాజు, రాయపదేవుడు, ఆహవ మల్లనృపతి యను నలుగురు కుమారు లున్నట్లును, అందు అనుంగు కామరాజునకు కామనృపుడు, అతనికి శాసన కర్తయైన రెండవ బేతరాజు కలిగినట్లును గలదు.




రెండవ శాసనము క్రీ.శ. **1129** నాటిది. బిరుదాంక రుద్రుడను నామాంతరము గల చాగి బేతరాజు పలనాటికి ప్రభువై భూలోకమల్లునకు కప్పము కట్టుచుండెననియు అతడు కామనూరు వాస్తవ్యుడును ఋగ్వేద పాఠియునైన నొక బ్రాహ్మణునిచే మాధవీపురములో ప్రతిష్ఠింపబడిన త్రిమూర్తి దేవాలయమునకు భూదానము చేసెననియు గలదు. ఈ శాసనమొక నాగస్తంభముపై గలదు. శాసనములోని మొదటి రెండు శ్లోకములలో శేషుడు, వాసుకి మొదలగు అష్టనాగముల ప్రార్థన కలదు. మాధవీపురమనగా ప్రస్తుత గురజాలయైయున్నది. అప్పటికి గురజాలలో చెన్నకేశవాలయము లేనట్లే. పై రెండు శాసనములను బట్టి క్రీ.శ. **1111**నాటి బేతరాజే క్రీ.శ. 1129నాటి బేతరాజని ఏర్పడుచున్నది.

ఆహవమల్లుడనగా క్రీ.శ. 1042-68 వరకు గల పశ్చిమ చాళుక్య చక్రవర్తి ఒకటవ సోమేశ్వరుడు. మొదటి శాసనములోని బేతరాజు**1** పైన కనిన ఆహవమల్లునికి సామంతుడై యున్నట్లు తన కుమారునికి ఆహవమల్లనృపతి యని పేరు బెట్టుటనుబట్టి తెలియుచున్నది. రెండవ (1129) శాసనములోని బేతరాజు2 భూలోకమల్లునకు కప్పము కట్టుచున్నట్లు శాసనములో చెప్పబడినది. భూలోకమల్లుడు, త్రిభువనమల్ల ఆరవ విక్రమాదిత్యుని మరణానంతరము క్రీ.శ. **1126**లో రాజ్యమునకు వచ్చిన మూడవ సోమేశ్వరుడు, పశ్చిమ చాళుక్య చక్రవర్తి. కావున పలనాటి నేలియున్న చాగివంశపు రాజులు పశ్చిమ చాళుక్య నృపతులకు సామంతులైయున్నట్లు స్పష్టపడుచున్నది.

ఆరవ విక్రమాదిత్యుని క్రీ.శ. **1118** నాటి వేంగిదేశము మీది దండయాత్ర తన సామంతులైన పల్నాటి ప్రభువుల అండదండలతో సాగినది. అప్పటి చాళుక్య చోళ చక్రవర్తుల సేనాపతి వెలనాటి చోళప్రభువు గొంకరాజు2. ఇతడు విక్రమాదిత్యుని సేనానుల నెదిరించి పోరాడుచు మొదట కృష్ణకు దక్షిణమున గల దేశమును తిరిగి జయించినట్లు కనుబడుచున్నది ఇది క్రీ.శ. **1130** నాటికి జరిగినది. కావున పల్నాడు క్రీ.శ. **1130** నాటికి వెలనాటి చోళగొంకరాజు2నకు స్వాధీనమైనది. తరువాత క్రీ.శ. **1137**నాటికి వేంగిదేశమునుండి విక్రమాదిత్యుని సేనలను పారద్రోలి చాళుక్య చోళచక్రవర్తిచే క్రీ.శ. **1137**లో రెండవ గొంకరాజు వేంగి దేశాధీశునిగ జేయబడెను అంతవరకు నతడు చోళ చక్రవర్తుల సర్వసేనాపతియు చందవోలు రాజధానిగ వెలనాటినేలు ప్రభువు మాత్రమే అయియున్నాడు.

మూడవ శాసనము క్రీ.శ. **1147**నాటిదై అనుంగు కామరాజు లేక మైలమదేవి కామరాజు అనువానిచే వేయబడినది. ఈ శాసనమునాటికి అనుగురాజు మైలమదేవిని పెండ్లాడి పల్నాటికి రాజై గురజాలలో రాజ్యము చేయుచున్నట్లు తెలియుచున్నది. అప్పటికి గురజాలలో చెన్నకేశవాలయము కనుపడుచున్నది. ద్విపద పలనాటి చరిత్రలో అనుగురాజు కనకాద్రినుండి తన వెంట తీసికొనిపోయిన చెన్నకేశవస్వామిని గురజాలలో ప్రతిష్ఠించినట్లు

"ఇచ్చట నిలచెద మిద్దరమిపుడు
తిరుగ గట్టించు దేవళమ్మొకటి"

అని చెన్నుడు అనుగురాజుతో నన్నట్లును, అంతట "భూవిభుడు

చెన్నకేశవునకు చెలు వగ్గలింప
కోవెల గట్టించె గురజాలలోన"

-అని చెన్నకేశవాలయము గురజాలలో కట్టించినట్లున్నది. తరువాత మాచర్లలో బ్రహ్మనాయడు చెన్నకేశవాలయమును గట్టించెను

పల్నాటి వీరచరిత్రలోని అనుగురాజు తండ్రి వీరకాముడు. క్రీ.శ. 1129 శాసనములోని రెండవ బేతరాజు (బిరుదాంక రుద్రుడు) అనుగురాజు తండ్రి కాడు. హైహయ రాజులలో ఆంధ్రదేశమునకు వచ్చినవారిలో ఒకటవ బేతరాజునుండి బిరుదాంకరుద్ర రెండవ బేతరాజువరకు నలుగురు రాజులు కనుపడుచున్నారు. వీరికిని అనుగు రాజునకును సన్నిహిత సంబంధమున్నట్లు లేదు. కావున ద్విపద కావ్యములోని అనుగురాజు ఈ చాగివారి వంశములో వేరొక శాఖకు చెందినవాడు కావచ్చును. కాని అందరును ఆత్రేయ గోత్రికులే. ఇతడు క్రీ.శ. 1111నాటి శాసనములో ఒకటవ బేతరాజుయొక్క నల్గురు కుమారులలో నొకరి సంతతియై యుండవచ్చును. ఇతడు చేది మండలమును పాలమాచాపురి ముఖ్యపట్టణముగా నేలుచుండగా క్రీ శ. 1118లో త్రైలోక్యమల్లుడు ఆరవ విక్రమాదిత్యుని దండయాత్రలో నొక సేనానిగా వచ్చి అద్దంకిలో రాజ్య మేర్పరచుకొనిన సేవణరాజు. క్రీ.శ. 1135 ఆ ప్రాంతములో పాలమాచాపురిపై దండెత్తి అనుగురాజును చేది మండలమునుండి తరిమియుండును. అంతట అనుగురాజు తన రాజ్యమునువీడి పొరుగుననున్న మోటుపల్లి చేరి అచ్చట చందవోలు పృథ్వీశ్వరుడగు రెండవ గొంకరాజు ప్రాపుతో నతని కుమార్తె మైలమదేవిని వివాహమాడి ఆమెకు అరణముగా ఇవ్వబడిన, అప్పటికి గొంకరాజు స్వాధీనములోనికి వచ్చిన పలనాటికి ప్రభువై గురజాలకు చేరియుండును. కాని యెడల కేవలం బ్రహ్మహత్యాపాతకము బాపుకొనుటకు తీర్థ యాత్రలకు బయలుదేరినయెడల మంత్రులతోను, సేనానులతోను, సైన్యముతోను, కులదైవమైన కనకాద్రిలోని చెన్నకేశవస్వామి విగ్రహముతోను వెడలవలసిన పనిలేదు.

ద్విపద కావ్యములో

"అరయ లోకమ్ముల కాధారమనగ
ధరణి దేవికి ముఖ దర్పణమ్మనగ
పాలమాచాపురి పట్టణంబొప్పు"

"అట్టి పట్టణమేల్మలు నా మహారాజు
కార్తవీర్యుని వంశ ఘన పయోరాశి
వీరకాముని సుతుడు విమలచారిత్రు
డాత్రేయ గోత్రజుడలుగు భూవిభుడు"

"ప్రజల బిడ్డలనట్లు పాలించుచుండె"

"కనకాద్రి చెన్నుడు కారుణ్యమూర్తి
వడకుచు కడు బెక్కు వర్షముల్ చనిన
ముదుసలి వేషంబు ముచ్చట దాల్చి"

కనకాద్రి చెన్నుడనగా కనకాపురి యనెడు కనుపర్తిలోని చెన్నకేశవస్వామి వచ్చి బ్రహ్మహత్యా పాతకము బాయు నుపాయము చెప్పుటయు నంత అనుగురాజు మంత్రి సేనానులతోను, ఆత్మబంధువులు 72 గోత్రాలవారితోను, పంద్రెండిండ్ల పద్మనాయకులతోను పాలమాచాపురి వెడలి

"కనకాద్రి చెంతకు కడు వేగవచ్చి
కదలుము మా వెంట కదలుమనంగ"

చెన్నకేశవుని విగ్రహమును పీటపైకెత్తించి వెంట గొంపోయెను.

ఆ రేయి

"వాగు వాగేశ్వర పట్టణంబరిగి
జాగరణంబులు సల్పి యా రేయి
సరగున నదిలోన స్నానంబు సేయ
తెల్లగా వస్త్రములో తేలకపోయె"

రాపర్ల మాచవరమునకు తూర్పున నాలుగు మైళ్ళలో కనకాపురి యనబడెడి కనుపర్తి, ఉత్తరము ఎనిమిది మైళ్లలో ప్రస్తుతం రొంపేరు అని పిలువబడు వాగు గలదు. దానిని బాపట్లవద్ద వార యని పిలుతురు. వాగు దాటిన తరువాత పదిమైళ్లలో మోటుపల్లి సముద్ర తీరమున్నది.

"సాగర జలముల స్నానంబు చేయ
కట్టు పుట్టము లెంతో కాంతి చెన్నొందె"

ద్విపద కావ్యంలో వాగు వాగేశ్వరంనుండి ఉత్తరదేశ యాత్ర తిరిగి మోటుపల్లి చేరుట కవి కల్పన. రఘుమహారాజు, పెద కోమటి వేమారెడ్డిగారల దండయాత్రలవలె భావించవచ్చును. మోటుపల్లివద్ద విడిసియుండగ

"చెందవోలు పృథ్వీజన నాయకుండు
పడతి మైలమ్మను పరిణయమాడి
నా కోర్కి మన్నించు నరనాథ నీవు"

"చిన్న కూతురు పెండ్లి చేసెనావేళ
పెంపార పుత్రికి పృథ్వీశ్వరుండు
ఇంపార పసుపున కిచ్చె పల్నాడు"

గురజాల చేరి రాజ్యము చేయుట, కనకాద్రినుండి వెంట తెచ్చిన చెన్నకేశవస్వామిని గురజాలలో ప్రతిష్ఠించుట జరిగి యుండును. అంతకుముందు పలనాటిలో చెన్నకేశవారాధన లేదు. క్రీ.శ. 1111లోని మాచర్ల శాసనములో ఆదిత్యేశ్వరాలయము క్రీ.శ. 1129నాటి గురజాల శాసనములో వీరభద్రుని గుడి, త్రిమూర్తిఆలయం కనుపించుచున్నవి.

ద్విపదలోని అలుగురాజు II బేటరాజుగాని అతని కుమారుడుగాని కావచ్చునని కొందరు తలంచుచున్నారు. కాని అది సరికాదు. ఏలనన రెండవ బేటరాజువరకు గల పలనాటి హైహయరాజులు పశ్చిమ చాళుక్య చక్రవర్తులకు సామంతులై వేంగిదేశముపై జరిగిన దండయాత్రలలో (క్రీ.శ. 1118 నుండి 30) పశ్చిమ చాళుక్య సేనానులకు సహాయులుగా యుద్ధములలో పాల్గొనినవారై యున్నారు. వారిని రెండవ గొంకరాజు యుద్ధములలో నోడించి పలనాడును స్వాధీనపరచుకొని యున్నాడు. అట్టి గొంకరాజు వారికే తన కుమార్తెనిచ్చి పలనాడును తిరిగి వారికే యిచ్చెననుట నమ్మదగినదిగా లేదు. క్రీ.శ. 1111నాటి రెండవ బేటరాజే 1129నాటి బేటరాజై నయడల నతనికి క్రీ.శ.1135నాటికి వయసు మళ్లియుండును.

అలుగురాజు పై శాసనములలోనివాడే యైనయడల పల్నాడు నేలుచున్నవాడు చేది దేశములోని పాలమాచాపురి నుండి చందవోలు వచ్చుట పొసగదు. కావున అలుగురాజు పాలమాచాపురి రాజై చందవోలు చేరి అచ్చట మైలమదేవిని వివాహమాడి పల్నాడును అరణముగా పొందినట్లు ద్విపద కావ్యములోని కథ పాలమాచాపురి పల్నాడుకు సంబంధించిన పట్నము కాదని ఏర్పడుచున్నది. కొందరు విమర్శకులు మాచర్లయే పాలమాచాపురి యని భావించుట కూడ పొరబాటే.

రావర్ల మాచవరం ఒంగోలు-బెజవాడ రైలుమార్గములోని అమ్మనబ్రోలుకు ఉత్తరముగా ఒకటి రెండు మైళ్లలో రైలు కట్టకు పడమరగా నానుకొనియున్నది. ప్రస్తుతం రావర్లను రైలు హాల్టుగా నేర్పరచియున్నారు.

# అన్వేషణ

## శ్రీ శివలింగం

నన్ను వెంటాడుతోంది అహంకారం
కామం నన్ను పాములా చుట్టుకుంటోంది
మనస్సు పవిత్రంగా వుందామనుకున్నా
అపవిత్రం చేస్తున్నాయి ఇంద్రియాలు
ఆలస్యంగా తెలుసుకున్నాను
లోకదృష్టికి కాదు
లొంగుతాయని లోచూపుకు.
నాలో లోకం పెంచిన గోడలు కూలాలి
రజస్తమోగుణాల పొరలు తెగాలి.
ఇంద్రియాలన్నీ కలిస్తేగాని
మనసు దొంగ దొరకదు.
ఆ బంధనలోనే అనంతస్వేచ్ఛ
సత్యంలో తెలుస్తుంది తత్వం
అన్వేషణలోనే లభ్యం అమూల్యమణి.
అప్పుడే తెలుస్తుంది మరణసత్యం.
కష్టాలొచ్చినా కన్నీళ్లొచ్చినా
ఆగదు అన్వేషణ.

## ఆశానిరాశల మధ్య

చెట్టు ఏడుస్తోంది!
ఆకులు రాలుతున్నాయనీ కాదు
పూవులు వాడుతున్నాయనీ కాదు
ఆయుష్షు తరుగుతున్నందుకు
అకాలమరణం చెందుతున్నందుకు.

గొడ్డలి రోదిస్తోంది!
రక్తాశ్రువుల్ని కారుస్తోంది!
దాహం తీరకా కాదు
అన్నం దొరక్కా కాదు
తన చేతుల్తో తన వంశాన్ని
మట్టుబెట్టాల్సి వస్తున్నందుకు!

మబ్బులు దిక్కులు చూస్తున్నాయి
ఎక్కడ ఆగాలో,
ఏ చెట్లుని ఆశ్రయించాలో తెలీక
ఎక్కడ కురియాలో బోధపడక!

ఏ పక్షైనా, ఏ రేవునుంచైనా,
ధాన్యం పరకల్ని మోసుకొస్తుందేమోనని,
మనుష్యుల ఆశ!
ఏ మనిషైనా చెట్టై వాలనిస్తాడేమోనని
పక్షుల ఆశ!

కానీ, ఇరుజీవుల ఆశలూ
కలుసుకోని రైలుపట్టాలై,
అటు నిరాశావాదుల వీపులు తడుతూ,
ఇటు చూపులకందని దూరంలో కలిసిపోతూ,
రెపరెపలాడే ఆశావాదుల ప్రాణాలకి
చేతుల్ని అడ్డుపెడుతున్నాయి!

శ్రీ గన్ను కృష్ణమూర్తి

## మహా భుజంగాలపై మానవతను పూయిస్తూ....

నేను-
అసిధార అంచుల్లో
పసిబిడ్డను చూస్తున్న వాణ్ణి.
గండశిలామయ కొండలలో
కారుణ్యం పండిస్తున్న వాణ్ణి.
కంటకావృత విపిన సీమల్ని
బృందావనాలుగా మలుస్తున్న వాణ్ణి.
పులులకీ సింహాలకీ పాలిస్తున్న వాణ్ణి
మత్తమాతంగాల్ని లాలిస్తున్న వాణ్ణి.
నక్కల ఊళల్ని
నాదస్వరాలుగా మారుస్తున్న వాణ్ణి.
తుమ్మెద రొదల్ని
వేదనాదాలుగా కూరుస్తున్న వాణ్ణి.
మహాభుజంగాలపై నయితం
మానవతను పూయిస్తున్న వాణ్ణి!
నేన—
గంగా యమునలు ప్రవహిస్తున్న వాణ్ణి
నిర్మల గోదావరీ వీచికలు పిలుస్తున్న వాణ్ణి.
మహాబోధికి ఊడనై
విశ్వశాంతికి గూడునై
వేల వసంతాల ఉద్గ్రంధసారంతో
నలభై పుటలు నడిచి వచ్చినవాణ్ణి!
నవనాగరికతను నలుగురితో పంచుకుంటున్న వాణ్ణి
అణ్వస్త్రాల మెరుపుల్లో ఆమనికై ఎదురుచూస్తున్న వాణ్ణి
నేను హిందు(భ)వుని
సత్యాహింసల బిందువుని
దయాంతరంగ సింధువుని!!

జిప్సి



కీ॥ శే॥ కే. యస్. కోదండరామయ్య

# నన్నయభట్టు - ఆంధ్ర భారత రచన

## రాజరాజు ఆనతికి నన్నయ రంగమును సిద్ధము చేసిన వైనము

తొమ్మిది శతాబ్దాలకు పూర్వము అనగా ఆ యారంభ దినములలో నన్నయ ఆంధ్రభాష కొనరించిన సేవ యింతింత యనరానిదని, ఆచార్య శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు చెప్పియుండునది అక్షరశః సత్యము.

నన్నయసారమతి. విపుల శబ్దశాసనుడు. సంహితాభ్యాసుడు. బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాననిరతుడు. ఉభయభాషా కావ్యరచనాభిశోభితుడు. లోకజ్ఞుడు. ఇట్టి సర్వతోముఖమైన పాండిత్య ముండినవాడై నందుననే రాజరాజు తెనుగులో భారత రచనాకార్యము నతనికే యొప్పగించెను. ఆ మహాకార్యమున కతడన్ని విధముల సమర్థుడు.

ఆ కాలమున తెలుగు భాషలో నెవ్వరును మహాభారతమును వ్రాసియుండలేదు. లందువలన సంస్కృతభాష తెలియని తెనుగు వారికి భారతకథ సమగ్రముగా దెలిసియుండలేదు. అంతా గాసట బీసట చదువులే. ఆ గ్రంధము తెలుగులో కావలయునను ఆశ సర్వత్రా ప్రజలలో గాఢముగా నుండెను. ఈ విషయము నన్నయకు బాగుగా దెలియును. రాజరాజునకీ విషయము దెలియు ...ాతడు జేసెను. ఈ యిరువురి అభిప్రాయముయొక్క ఫలితమే ...గులో భారతము.

ఇంతేకాక, అప్పటికీ భారతకథ అరవములోను, ...ములోను వ్రాయబడి ఆయా దేశములలో మంచి ప్రచార...ు. అరవభాషలో భారతమున్నదనుట నన్నయకు ... కాని, ఆ భాషా పరిచయ మతనికుండెనో లేదో ...నియే జెప్పవచ్చును. కన్నడభాష అతనికి బాగుగా ...కన్నడ భారతమునతడు చదివియుండెను. ఆతడు మైసూరు ప్రాంతమున, బాల్యమందు వేదపాఠశాలలో విద్యాభ్యాసము గావించెను. ఆ సమయమున నాప్రాంతమువాడేయయిన నారాయణభట్టు అనునతడు నన్నయ కిష్టుడై సహాధ్యాయుడుగ నుండెను. ఆ సమయమున వారిరువురు పంపమహాకవి కన్నడములో వ్రాసియుండిన భారతమును జదివియుండిరి. ఆంధ్ర భాషలోగూడ నట్టి గ్రంధముండవలయునను ఆలోచన నన్నయ కానాడే యేర్పడెను. ఆ సంకల్ప మాతని హృదయములో గాఢముగా నెలకొనెను. నారాయణభట్టాతని ఆశయమును బల పరచెను.

పంపమహాకవి ఆంధ్రుడు. ఆతని జన్మభూమి వేఁగి మండలము. కాని, అతడు జైనమతము నవలంబించియుండెను. ఆంధ్రదేశమున నా కాలమున జైనమతమున కంత ప్రచారము, ప్రోత్సాహముండలేదు. అందువల్లనే యాతడు జైనుడయిన వేములవాడ చాళుక్యరాజును అరికేసరిని ఆశ్రయించి, ఆతని యాస్థానకవి యయ్యెను. ఆ నృపాలుని కోరిక ననుసరించి, కన్నడములో భారతము వ్రాసెను. ఆ గ్రంధము కన్నడ భాషలో నున్నను, సూక్ష్మముగ నా గ్రంధమును పరిశీలించిన పంపకవి తెలుగు హృదయము గోచరించును. పంపకవి తనకు ముందున్న కన్నడ కవులను స్మరించలేదు.

పంపడు తన పోషకుడైన అరికేసరిని భారత మహావీరుడగు అర్జునునితో బోల్చి ఆతని పరాక్రమమును గొప్పగా వర్ణించియున్నాఁడు. తెనుగు కవియైనను, కారణాంతరము వలన పంపకవి భారతమును కన్నడములో వ్రాయవలసి వచ్చెను. పంపకవి తన భారతములో సృష్టించిన పాత్రములు మూలగ్రంధము

దేవుడు జీవరాశి (మనుషులతో సహా)ని ఆటవస్తువులుగా చేసికొని "స్పోర్టు"లాడును. హార్డీ నవల "టెస్"లో టెస్ అనే అభాగినిని ఉరి తీయుదురు. న్యాయము జరిగినది. "అమర్త్యుల అధ్యక్షుడు" టెస్‌తో తన ఖేలనను ముగించెను.

**10**

భగవంతుడు "ఓవర్‌సీయరు". పైనుండి విశ్వమునంతటినీ గమనించుచుండును. "అధ్యక్షపరమే వ్యోమాన్" అని ఋగ్వేదము "నాసదీయసూక్తము"లో భగవంతుని పేర్కొనును. గ్రీకు నాటకకర్త ఇస్కైలస్ గ్రీకుదేవుడు జియస్‌ను "అమర్త్యుల అధ్యక్షుడు" అని పేర్కొనును.

**11**

భగవంతుడు ప్రాడ్వివాకుడు, న్యాయనిర్ణేత. పుణ్యపాపముల వంపిణీదారుడు. ఇది కర్మ సిద్ధాంతము. క్రయిస్తవులు, ముస్లిములు విశ్వాసముబట్టి దేవుడు "అంతిమ విచారదినము" ("లాస్ట్ డే ఆఫ్ జడ్జిమెంటు", "డూమ్స్‌డే") నాడు, వారువారు చేసిన పుణ్యపాపముల ప్రకారము పారితోషికాలు, శిక్షలు ఇచ్చును. హిందువులలో అప్పటికప్పుడు దేవుడవతారమెత్తి దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేయుచుండును.

**12**

భగవంతుడు ఆశ్రితరక్షకుడు. కాకాసురుడు, విభీషణుడు, ప్రహ్లాదుడు, గజేంద్రుడు, మార్కండేయుడు రక్షితులు. శ్రీవైష్ణవుల శరణాగతి (ప్రపత్తి), వీరశైవుల దాసోహం, ముస్లిముల "ఇస్లాం"లు "త్వమేవ శరణం మమ"లే.

**13**

భగవంతుడు కాపరి. భక్తులు మంద ("ఫ్లాక్") శివుడు పశుపతి, శ్రీకృష్ణుడు గోపాలుడు. ఏసుక్రీస్తు గొర్రెల కాపరి ("షెపర్డ్").

**14**

భగవంతుడు యజమాని. భక్తుడు దాసుడు, సేవకుడు. దీనిని శ్రీవైష్ణవములో శేషి-శేష సంబంధమందురు. భగవంతుడు శేషి. ఆదిశేషుడు, గరుడుడు, నంది విష్ణుచిత్తుడువంటివారు శేషులు. ఈ శేషస్థానమన్నిటికంటే "సేవు" "శేష" అను పేరు శ్రీవైష్ణవులలో ఎక్కువగా కనపడును. ఒక ఆళ్వారు తాను విష్ణుదాసుని దాసుని దాసుని దాసుడనినాడు. దాసగొలుసులో ఎంత దూరముండిన అంత మేలు.

**15**

భగవంతుడు దాసుడు, సేవకుడు. భక్తుడు యజమాని పురందరదాసుడిట్లు పాడెను. "పూలు తెచ్చినవారింట హరి గడ్డి మోయును". బాణాసురుని ఇంటికి శివుడు కావలి కాచెను. సతీసక్కూబాయి పాండురంగనితో ఊడిగము చేయించుకొనెను.

**16**

భగవంతుడు గురువు. భక్తుడు శిష్యుడు. గీతోపదేశఘట్టములో శ్రీకృష్ణుడు గురువు అర్జునుడు (అంటే మనమందరము) శిష్యుడు. "కృష్ణం వందే జగద్గురుం". దక్షిణామూర్తి (శివుడు) గురువు, ఋషులు శిష్యులు.

**17**

భగవంతుడు శిష్యుడు. భక్తుడు గురువు శ్రీరామునికి విశ్వామిత్రుడు బల, అతిబల అను విద్యలు నేర్పెను. శ్రీకృష్ణుడు సాందీపని యొద్ద గురుకులవాసము చేసెను.

**18**

భగవంతుడు స్వామి. భక్తుడు విశ్వాసపాత్రుడు (కాన్ఫిడెంటు). స్వామి పరముగ "ట్రబుల్‌షూటరు"లుగా వర్తించెదరు. ఉద్ధవుడు, విదురుడు శ్రీకృష్ణునకు హనుమంతుడు శ్రీరామునకు, వీరభద్రుడు శివునికి విశ్వాసపాత్రులు. అల్లాకు గేబ్రియలు విశ్వాసపాత్రుడు. గేబ్రియల్‌ద్వారానే అల్లా తన సందేశమును మహమ్మదు ప్రవక్తకిందజేసెను. నారదుడు దేవదానవ మానవులందరికి నమ్మకస్తుడే.

**19**

భగవంతుడు, భక్తుడు స్నేహితులు. శ్రీరాముడు-సుగ్రీవుడు, శ్రీకృష్ణుడు-కుచేలుడు, శివుడు-కుబేరుడు.

**20**

భగవంతుడు వైద్యుడు. భక్తుడు రోగి. మయూరుడు, నక్కీ(తీ)రుడు, సాంబుడు - తమ కుష్ఠురోగమును మాన్పుకొనిరి. నారాయణ భట్టతిరి కీళ్లనొప్పులు పోయెను. తిన్నని, విరుపన్న కన్నులు వచ్చెను. కుబ్జగూని చక్కనాయెను. మూగవాడు మాటకారి యగును. కుంటివాడు కొండ సెగురును. ఈశ్వరునకు వైద్యనాథుడని బిరుదున్నది. లౌర్డ్స్ (ఫ్రాంసు), వేలంకన్ని (తమిళనాడు), గుణదల (ఆంధ్ర)లో వెలసిన మేరీమాత సర్వరోగ నివారిణి. ఒరిస్సాలోని సాక్షి గోపాలుడు రోగహరుడు.

## 21

భగవంతుడు పాపహరుడు, భవరోగవైద్యుడు అజామీళుడు, పింగళ, నిగమశర్మ పాపనిర్ముక్తులైరి. క్రయిస్తవ మతం ఆదిమ దంపతి "మూలపాపం" అను భావముపై నాధారపడింది. ఏసుక్రీస్తు భక్తుల పాపనివృత్తి కొరకు ఆత్మ బలిదానము చేసెను. "పాపోహం, పాపసంభవ" అని మన శాస్త్రములనినవి. పాపనివృత్తి దేవుని ప్రధానవృత్తి.

## 22

భగవంతునకు భక్తునకు లైంగిక సంబంధమున్నది. పద్మావతి, నీళాదేవి, గోదాదేవి, మధురమీనాక్షి దేవుని పెండ్లి చేసికొనిరి. మధురరాజు, విష్ణుచిత్తుడు, ఆకాశరాజు దేవుని మామలయిరి. భగవంతుడల్లుడు, రాధ, గోపికలు, మీరాబాయి, అక్కమహాదేవివంటి స్త్రీలు దేవునే ప్రియునిగ భావించిరి. శ్రీకృష్ణుడొకడే పురుషుడు. తక్కిన ప్రకృతియంతయును స్త్రీయే అని మీరాబాయి రూపగోస్వామిని మందలించెను. స్త్రీలేకాక నమ్మాళ్వారు, బసవేశ్వరుడు, చైతన్యుడువంటి మగవారు భగవంతుని ప్రియునిగ, తమను ప్రియురాండ్రుగ రూపించుకొనిరి. ఇట్టి సంబంధమునకు మధురభక్తి అని పేరు. శేషి-శేష భావము తర్వాత మధురభక్తియే చాలా "పాప్యులరు"సంబంధము. జయదేవ, విద్యాపతి, చండీదాసు, అన్నమయ్య, క్షేత్రయ్య దయారాంల పదావళులలో మధురభక్తి వర్ణితము. మధురభక్తి "పరమప్రేమ రూపా" బైబిలు (పూర్వాధ్యాయము) లోని "సాలమన్ పాట" మధురభక్తి పూరితము. మధ్యమ యుగములో క్రయిస్తవ మార్మిక వేదాంతులు మధురభక్తిని అనుభవించినవారు. ఇచ్చట పేర్కొన్న ఉదాహరణములు. భగవంతుడు పురుషుడు, భక్తులు స్త్రీలు అను ప్రాతిపదికమీద ఆధారపడినట్టివి. "ప్రకృతి" అనే పదము స్త్రీలింగము అగుట, "పురుష" పదము పుల్లింగమగుట దీనికి మూలకారణము. కపిలుని సాంఖ్య సూత్రములలోను, ఈశ్వరకృష్ణుని సాంఖ్యకారికలలోనూ ఈ "మిస్‌ఛిఫ్" జరిగినది.

## 23

భగవంతుడు భార్య. భక్తుడు భర్త. ఇట్టి సంబంధము కల్హణుని "రాజతరంగిణి"లోని యొక కథలో వచ్చును. విశ్వనాథ సత్యనారాయణ నవల "భ్రమరవాసిని" ఈ ఐతిహ్యము మీద ఆధారపడినది. సూఫీ వేదాంతములో కూడా ఇట్టి సంబంధమే కన్పించును.

## 24

భగవంతుడు దొంగ. భక్తునిదేదో దొంగిలించుకొని పోవును. శ్రీకృష్ణుడు గోపికావస్త్రాపహర్త, నవనీతచోరుడు, భక్తజన చిత్తచోరుడు. డెవిల్ మనిషి ఆత్మకొంటాడు. ఉదా: గెటే "ఫౌస్టు". ఏసుక్రీస్తు, బుద్ధుల "టెంప్టేషను".

## 25

భగవంతుడు వేటకుక్క. భక్తులు దారితప్పిన జీవాలు (ఫ్లాక్). వీరిని వెన్నంటి, సరైన స్థలానికి ("సదనం ఋతస్య" అనును ఋగ్వేదం) మరలించు దేవశుని (సరమ) దేవుడు. ఇంగ్లీషు కవి ఫ్రాన్సిస్ థాంప్సను మార్మిక తాత్విక కవిత "ద హవుండ్ ఆఫ్ హెవెన్"లో ఈ సంబంధానికి అద్భుత చిత్రీకరణము కలదు. "ద హవుండ్ ఆఫ్ హెవెన్" అంటే "శౌన పరమాత్మ" - పరమాత్మ అనే శునకం అని అర్థం. శ్రీశ్రీ "స్వర్గభైరవం" అని అనువదించెను. అది సరికాదు.

## 26

భగవంతుడు జగన్నాటక సూత్రధారి. "కాస్మిక్ పప్పెటీర్" జీవులు పాత్రలు, కీలుబొమ్మలు, తోలుబొమ్మలు: జగమంతా నాటకరంగం అన్నాడు షేక్స్పియరు.

## 27

భగవంతుడు ఐశ్వర్యదాత. భాగవతములో కుచేలునకు శ్రీకృష్ణుడు, బైబిలులో "జాబ్"కు యెహోవా ఐశ్వర్యమిచ్చిరి. సత్యనారాయణ వ్రతము చేయుట సంపత్తుకే. జనులకు ఐశ్వర్యమునిచ్చి, యిచ్చి మహేశ్వరుడు బుక్కాఫకీరు ఆయెను. ఆయన ఆదిభిక్షువు. ఆయన భార్య అన్నపూర్ణ అన్నదాత్రి.

## 28

భగవంతుడు మార్గదర్శకుడు. మోసెస్‌కు దేవుడు దారి చూపించినాడు. న్యూమన్ ప్రార్థన "దారి చూపించు దయామయ జ్యోతీ", ఋగ్వేదములోని "ధియో యోనప్రచోదయాత్" అనునవి మార్గదర్శక వచనములు. ఈ మార్గము జ్యోతిర్మార్గము. సత్యమార్గం ("పంథా ఋతస్య" - ఋగ్వేదము). జాన్‌బన్యన్ మార్మికరచన. "యాత్రిక పురోగతి"లో భక్తునికి ఒక జ్యోతి మార్గదర్శకమగును. నీకు నీవే జ్యోతివి కమ్ము అని బుద్ధుని బోధ.

## 29

భగవంతుడు మనిషి పరస్పర వైరులు. హిరణ్యకశిపుడు, శిశుపాలుడు, వేనుడు, సేటనులు అట్టివారు. బ్రహ్మకు విశ్వామిత్రుడు ప్రతిద్వంద్వి, ఆయన సృష్టికి ఈయన ప్రతిసృష్టి

చేయును. మేటరుకు ఆంటీమేటరుండు ననెదరు భౌతిక విజ్ఞాన శాస్త్రజ్ఞులు.

30

భగవంతుడు మానవునికి మిషామేషం (స్కేప్‌గోటు) మన కష్టాల కన్నింటికీ వాడే కారకుడని, బాధ్యత నిష్ఠారము వాని నెత్తిన రుద్దెదము. ఈ దేవుడు అదృష్టము, గ్రహబలము, ప్రారబ్ధము, విధి, లలాటరేఖ, "ఖర్మ", నసీబ్, కుదరత్, ఫేట్, లక్, ఆటే (గ్రీకు పదము) అనే పదజాలముతో కూడ వ్యవహరింపబడుచున్నాడు.

31

భగవంతుడు బలిపశువు. గ్రీకుదేవుడు డయోనిసస్‌ను ప్రతిఏట పంటనూర్పిడి కాలమప్పుడు పూజించి బలిచేయుదురు. ఇట్లు చేసిన పంటకు లాభమని నమ్మకం. ఇట్టి దేవుళ్లు "హార్వెస్ట్ గాడ్సు" లేదా సుగ్గిదేవరలు. ధాన్యపతులు, సస్యనాథులు, బదరీనాథ, కేదారనాథులట్టి క్షేత్రనాథులు కావచ్చును. కొత్రపంట దేవుడు "నవణీపతి" అట్టి దేవుడు.

32

భగవంతుడు విశ్వానికి వారసుడు. సమస్త ఆస్తి ఆయనదే అయినా దేవుడు అదృశ్యభూస్వామి ("ఆబ్సెంటీ లాండ్ లార్డ్). మానవుడా యాస్తికి ధర్మకర్త, "ట్రస్టీ", ఈశావాస్యోపనిషత్తులోని మొదటి మంత్రము "ఈశావాస్యమిదం సర్వం" ఈ భావమునే చెప్పుచున్నది. గాంధీమహాత్ముడు ప్రతిపాదించిన ట్రస్టీషిప్ సిద్ధాంతము భగవంతునకు, మానవునకు మధ్య కల ఆర్థిక - న్యాయచట్ట సంబంధమును సూచించును. ఆబ్సెంటీ లాండులార్డుకు పట్టిన గతే ఈ ఈశావాస్యునికి పట్టినది. ధర్మకర్త అయిన మానవుడు పృథివిని, అందరికీ చెందవలసిన భూమిని, సమష్టి ప్రకృతి సంపదను తానే స్వాహాచేసి దేవుని కెగనామము పెట్టినాడు అనేది రామప్పంతుల పరిభాషలో "అది వేరే కథ".

33

భగవంతుడు మనిషీ ఇద్దరూ ఒక్కరే. శివోహం, అహం బ్రహ్మాస్మి, తత్వమసి అనే వచనముల ఆధారముగా అద్వైత మతం వెలసింది.

34

భగవంతుడు ఒక ప్రతిపాదన మాత్రమే, "ప్రపోజిషన్" మనిషి మెదడులో పుట్టిన భావమది. భగవంతుడే మానవుని సృష్టి. మనిషి తన ప్రతిబింబముగా దేవుని సృష్టించుకొవినాడు. అందుకే ఈ మానవీయ సంబంధ బాంధవ్యాలు దేవునితో ఏర్పడినవి.

35

భగవంతుని పూర్ణము, శూన్యము, పూజ్యము, శుభ్రము (ఇంగ్లీషు పదము "సిఫర్" అరబీ భాషద్వారా సంస్కృత శబ్ద తద్భవము), అంటే సున్న అని రూపించుట కలదు. భగవంతుడు సున్నా అయితే, భక్తులు హేతువాద పరీక్షలో అదే విలువగల మార్కులు తెచ్చికొను పరీక్షాభ్యర్థులు.

"నిశ్శంక తిమ్మన్న"

# పూజా రహస్యము

లోకకంటకుడైన నరకాసురుని సంహరించిన మరునాడు దీపావళి. చీకట్లుపోయి వెలుగు వచ్చిందని చూపడానికి అమావాస్య నాడు దీపాలతో గృహాల నలంకరిస్తారు. అజ్ఞానానికి చీకటి, జ్ఞానానికి వెలుగు ప్రతీకలు. ఆ రాత్రి కేవలం దీపారాధనతో తృప్తిపడక రకరకాల రంగురంగుల బాణసంచా కాలుస్తారు. ఉదయం పూజలు చేసుకొంటారు. నిజానికి పూజయే ప్రధానం. పూజలు, జపాలు, వ్రతాలు వీటి అంతరార్థమేమిటి?

జగత్తంతా శక్తిమయం. శక్తి వ్యాపించని ప్రదేశం మచ్చుకైనా లేదు. భూతలంపైనున్న మనం శక్తిసాగరం యొక్క మట్టంలో నున్నట్లు భావించుకోవాలి. వేడి, వెలుగుతో బాటు ఇంద్రియ గోచరంకాని కోట్లాది శక్తి తరంగాలమధ్య మనం జీవిస్తున్నాము. 120 ఏండ్ల క్రిందట విద్యుదయస్కాంత తరంగాలున్నాయని తెలియదు. నూరేండ్ల క్రితం వాటిని ఉత్పన్నం చేసే విధానం తెలియదు. కాని, ఇప్పుడు మనకు రేడియో, టి.వి.ల రూపంలో ఆ తరంగాలు ప్రత్యక్షమవుతున్నాయి. ఒక కేంద్రంనుంచి ప్రసారమయే తరంగాలు వేల మైళ్లు ప్రయాణం చేసి - వాటి వేగం సెకనుకి 1,86,000 మైళ్లు - వార్తలు, ఉపన్యాసాలు, సంగీతం - టి.వి. అయితే నృత్యం-మన కండ చేస్తున్నాయి. ఒక రేడియో కాని, ఒక ట్రాన్సిస్టర్‌కాని చేసే పనిని మనిషి చేయలేకపోతున్నాడు. ఆ యంత్రాలు విద్యుత్తరంగాలను పట్టుకొని, వాటిని మాటలుగా పాటలుగా మార్చి మనకు హాయి కలిగిస్తున్నాయి. అవి కేవలం యంత్రాలు. వాటిని సృష్టించినది మనిషి. కాని, తను చేసిన సృష్టిపాటి సామర్థ్యం మనిషికి లేకపోవడం అత్యంత విచారకరం.

సైన్సు మూలంగా యంత్రాలను సృష్టించకలిగేరు. రేడియో, టి.వి. యే కాకుండా రకరకాల యంత్రాలు మహత్తర కార్యాలు చేస్తున్నాయి. అయితే, మనలను ఆవరించిన శక్తి మనం నేరుగా గ్రహించే విధానం చెప్పగల స్థితిలో ఇంతవరకు, సైన్సు లేదు. అది దాని పరిధిలో లేదు. మానసికశక్తిని వినియోగించి మనస్సును అదుపులో పెట్టుకొని, పూజచేసి, జపం చేసి విశ్వశక్తిని సంగ్రహించే విధానం మన శాస్త్రాలు వివరించేయి. కాని అట్టి లాభం పొందడానికి తోడ్పడే యంత్రాల సృష్టి కాలేదు. పైగా, జపతపాలు వ్యక్తిగతం. కఠోరనియమాల ననుసరించి ఒక వ్యక్తి శక్తిని సంపాదిస్తే అది వానికొక్కనికే దక్కుతుంది. యంత్రాలను సైన్సు జనానికి పంచేటట్లు ఆ శక్తిని పంచడానికి వీలులేదు. ఏమంటే, శక్తి పోతే మళ్ళీ అంత శ్రమ పడి సంపాదించవలసిందేకాని మరో మార్గంలేదు.

ఈ దృష్టితో భారతీయ భగవద్భావం పరిశీలిస్తే మహత్తర సత్యం గోచరిస్తుంది. శక్తికి రూపంలేదు. శక్తి యొక్క ప్రత్యేకతనుబట్టి సైన్సులో నామాలు ఏర్పరిచేరు. కాస్మిక్ కిరణాలు, గామా కిరణాలు, ఎక్స్-కిరణాలు, అతి నీల లోహిత కిరణాలు, కాంతి తరంగాలు, వేడి తరంగాలు, పరారుణ తరంగాలు, రేడియో తరంగాలుగా వాటిని వ్యవహరిస్తారు. ఇవన్నీ విద్యుదయస్కాంత తరంగాలే! వాటికి మూలం ఒకటే! మనం యంత్రాలద్వారా ఉత్పన్నం చేస్తున్న విద్యుత్తుని అనేక విధాలుగా ఉపయోగిస్తున్నాము. ఒకే విద్యుత్తు బల్బులో ప్రవహిస్తే కాంతినిస్తుంది, ఫాన్‌లో ప్రవహిస్తే గాలినిస్తుంది, హీటర్‌లో ప్రవహిస్తే వేడినిస్తుంది, విద్యుత్ గంటలో ప్రవహిస్తే శబ్దాన్నిస్తుంది. ఇంకా ఎన్నెన్నో! ఒకే శక్తిని బల్బు అని, ఫాన్ అని, హీటర్ అని పేర్లు ఏమిటి? శక్తి చేసే పనిని బట్టి పేర్లు పెట్టుకొన్నాము.

ప్రాచీన ఋషీశ్వరు లేమన్నారంటే:

ఒకే విశ్వశక్తిని సృజించినప్పుడు బ్రహ్మ, రక్షించేటప్పుడు విష్ణువు, లయం చేసేటప్పుడు మహేశ్వరుడు అని నామకరణం చేద్దాము. విద్యార్థి సరస్వతిని, ధనార్థి లక్ష్మిని, బలార్థి ఆంజనేయుని పూజించి అవసరమైన శక్తి సంపాదిస్తారు, ఇదెంత సరళమూ సత్యమూ అయిన భావం.

విశ్వశక్తిని భారతీయులు సహస్రనామాలతో వర్ణించేరు. లలితా సహస్రం, సరస్వతీ సహస్రం, లక్ష్మీ సహస్రం, విష్ణు సహస్రం, శివ సహస్రం మొదలైనవి ఉన్నాయి. వాటిలో నామాలు జాగ్రత్తగా పరిశీలిస్తే శక్తి స్వరూపం, సామర్థ్యం. శక్తి ప్రసాదించగల ఫలితాలు స్పష్టమవుతాయి. మచ్చుకు కొన్ని నామాలు పరిశీలిద్దాము.

1. శక్తిస్థానములు :

| | |
|---|---|
| సూర్యమండల సంస్థితా | - సూర్యమండలమందున్న |
| సోమమండల మధ్యస్థా | - చంద్రమండల మధ్యనున్న |
| వహ్నిమండల సంస్థితా | - అగ్నిమండలమందున్న |
| వాయుమండల మధ్యస్థా | - వాయుమండల మధ్యనున్న |
| వ్యోమమండల సంస్థితా | - ఆకాశమండలమందున్న |
| సర్వోపనిషాస్థితా | - అన్ని ఉపనిషత్తులందున్న |
| గరుడోపరి సంస్థితా | - గరుత్మంతునిమీదనున్న |
| సముద్ర వ్యోమ మధ్యస్థా | - సముద్రానికీ ఆకాశానికీ మధ్యనున్న |
| బ్రహ్మాండాతర్బహిర్వ్యాప్తా | - బ్రహ్మాండానికి లోపల వెలుపల ఉన్న |
| సర్వ పర్వతవాసినీ | - అన్ని పర్వతములందున్న |
| సుధాసాగర మధ్యస్థా | - సుధాసాగరం మధ్యనున్న |
| మూలాధారైక నిలయా | - మూలాధారమందున్న |

2. శక్తిరూపం :

| | |
|---|---|
| బ్రహ్మాండశ్రేణి మేఖలా | - బ్రహ్మాండాలను ఒడ్డాణంగా గల |
| సహస్రాదిత్య సంకాశా | - వేయి సూర్యుల ప్రకాశంగల |
| ఇంద్రజాల స్వరూపిణి | - ఇంద్రజాలం స్వరూపంగా గల |
| సూర్యచంద్రాగ్ని రూపా | - సూర్యుడు చంద్రుడు అగ్ని రూపములుగా గల |
| గ్రహ నక్షత్రరూపిణీ | - గ్రహ నక్షత్రాలు రూపంగాగల |
| సోమసూర్యాగ్నిలోచనా | - సూర్యుడు చంద్రుడు అగ్ని కనులుగా గల |
| జ్యోతిశాస్త్రైక లోచనా | - జ్యోతిశ్శాస్త్రమే కన్నుగాగల |
| కాలచక్ర స్వరూపిణి | - కాలచక్రం స్వరూపంగాగల |
| ధ్యాన ధ్యాతృ ధ్యేయరూపా | - ధ్యాన ధ్యాతృ ధ్యేయములను త్రిపుటి స్వరూపంగా గల |
| ఋగ్యజుస్సామ రూపిణీ | - ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము రూపముగా గల |
| విద్యా విద్యా స్వరూపిణీ | - సంసారబంధం తెంపే జ్ఞానము విద్య; సంసారబంధం పెంచే జ్ఞానము అవిద్య. ఈ ద్వివిధ జ్ఞానము స్వరూపంగా గల. |

ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి
క్రియాశక్తి స్వరూపిణీ - అన్నిటికి మూలమైన ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తి అనే శక్తిత్రయ రూపము గల

3. కాలమే శక్తి, కాల విభాగాలు :

విభావరి - రాత్రి
రాకా - సంపూర్ణ కళలతో నిండిన పూర్ణిమ
కుహూ - చంద్రకళ కానరాని అమావాస్య
సినీవాలీ - చంద్రకళ కనిపించే అమావాస్య
అమావాస్య
పూర్ణిమ
సంధ్య
రాత్రి
జోత్స్న - వెన్నెలరాత్రి
కలా
కాష్ఠా
లవా
మాత్రా
నిమేషికా
ముహూర్తం

[పైన వివరించిన కాలవిభాగాల సంబంధం, ఒక పద్ధతి ప్రకారం ఇట్లుంది :

కాష్ఠ = 18 రెప్పపాటుల కాలం
కల = 30 కాష్ఠలు
మాత్ర = తృటి=లఘువు పలికే కాలంలో నాలుగవ భాగం
క్షణం = ఘడియలో ఆరవభాగం
ముహూర్తం = 2 ఘడియలు

శ్రీకృష్ణభగవానుడు గీతలో

కాలోస్మిలోక క్షయకృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తు మిహప్రవృత్తః (11, 32)

"లోక సంహారార్థం విజృంభించిన కాలుడను నేను" అన్నారు.]

4. శక్తి ప్రసాదించేవి ఎటువంటివంటే :

బ్రహ్మవిద్యా ప్రదాయినీ - బ్రహ్మవిద్యనిచ్చేది
సర్వోపద్రవనాశినీ - అన్ని ఉపద్రవాలను నాశంచేసేది
భక్తానామార్తినాశినీ - భక్తుల ఆర్తిని నాశం చేసేది
సర్వవ్యాధి చికిత్సకీ - అన్ని వ్యాధులకు చికిత్స చేసేది.
సర్వదారిద్ర్యభంజినీ - అన్నిరకాల దారిద్ర్యాలను పోగొట్టేది
గ్రహోపద్రవనాశినీ - గ్రహాలవల్ల కలిగే ఉపద్రవాలను నాశనం చేసేది.
కర్మ నిర్మూలకారిణీ - కర్మలను నిర్మూలించేది
త్రికాల జ్ఞానదాయినీ - భూత భవిష్యద్వర్తమానములను మూడు కాలాల జ్ఞానమిచ్చేది.
మనశ్శుద్ధి ప్రదాయినీ - మనశ్శుద్ధి నిచ్చేది
మనోదారిద్ర్యనాశినీ - మనస్సుయొక్క దారిద్ర్యాన్ని నశింపచేసేది
తాపత్రయాది సంతప్త సమాహ్లాదన చంద్రికా - తాపత్రయరూప సంసారాగ్నిచేత తపింపబడినవారికి సుఖం కలిగించే చంద్రకాంతివంటి
పాపారణ్య దవానలా - పాపమనే అడవిని దహించేది
దౌర్భాగ్యతూలావాతూలా - దారిద్ర్యమనే దూది సమూహానికి పెనుగాలివంటిది
జరాధ్వాంత రవిప్రభా - ముదిమి అనే గాఢాంధకారానికి సూర్యప్రభవంటిది
భక్తచిత్తకేకి ఘనాఘనా - భక్తుల చిత్తములనే నెమళ్లకు వర్షించే మేఘంవంటిది
మృత్యుదారు కుఠారికా - చావు అనే చెట్టుకు గండ్రగొడ్డలి వంటిది
సంసారపంక నిర్మగ్న సముద్ధరణ పండితా - సంసారమనే బురదలో మునిగియున్న జనులను పూర్తిగా తరింపచేసే సామర్థ్యంగల
ఉన్మేషనిమిషోత్పన్న విపన్న భువనావళి - కనురెప్పపాట్లతో సృష్టి స్థితి లయాలు చేయగల
భక్తహార్ద తమోభేద భాను మద్భాను సంతతి - భక్తుల మనస్సులనందున్న మాలిన్యమనే చీకటిని పోగొట్టే సూర్యకిరణ జాలంవంటిది
క్షేత్రక్షేత్రజ్ఞపాలినీ - క్షేత్రాన్ని క్షేత్రజ్ఞుని సంరక్షించేది

జన్మమృత్యు జరాతప్త
జన విశ్రాంతిదాయినీ - పుట్టుక, చావు, ముదిమిః వీటిచేత తపింపబడేవారికి విశ్రాంతినిచ్చేది

౬. శక్తి ఎటువంటిదంటే :

అనేకకోటి బ్రహ్మాండజననీ- కోట్లాది బ్రహ్మాండాలను పుట్టించేది
విశ్వనిర్మాణకారిణీ - విశ్వనిర్మాణానికి కారణమైన
విశ్వభ్రమణకారిణీ - విశ్వభ్రమణానికి కారణమైన
దేశకాలా పరిచ్ఛిన్నా - దేశతః కాలతః విభజింపబడనిది.
అభ్యాసాతిశయజ్ఞాతా - చిరకాల అభ్యాసంవలన తెలియబడేది

పైన వివరించిన నామాలను పరిశీలిస్తే సర్వం శక్తి స్వరూపమని తెలియవస్తుంది. ఖగోళశాస్త్రం అధ్యయనం చేసిన వారికీ నామాలతత్త్వం బాగా బోధపడుతుంది. విశ్వంలో స్థిరంగా నున్నదేదీ లేదు. భ్రమణ చలనాలు విశ్వంయొక్క ప్రధాన లక్షణాలు. నక్షత్రాలు పుట్టి పెరిగి నశిస్తున్నాయి. కోట్లకొలది నక్షత్రాల సమూహాలైన గేలక్సీలు కూడా అదే స్థితిలోనున్నాయి. అవి వెలువరించే శక్తి అనూహ్య పరిమాణంలో నుంటుంది. ఆకాశ కుహరాలలో పదార్థం శక్తిగాను, శక్తి పదార్థంగాను నిత్యం రూపాంతరం పొందుతునే ఉన్నాయి. సర్వవ్యాప్తమై మనచుట్టూ బహుతరంగరూపాలలోనున్న శక్తిలో అత్యల్పమైన భాగాన్ని అయినా సంగ్రహించడమే పూజయొక్క ముఖ్యోద్దేశం.

వసంతరావు వేంకటరావు

# కృష్ణరాయల ఆస్థాన కవులు

**1988** డిసెంబరు, **1989** జనవరి-ఫిబ్రవరి నెలల 'భారతి' సంచికలలో ప్రకటించబడిన ఆచార్య శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తిగారి "శ్రీకృష్ణదేవరాయలు-నవరత్నకవులు-అష్టదిగ్గజ కవులు" అన్న వ్యాసము ఆసక్తికరంగా సాగింది. వారు ప్రతిపాదించిన కొన్ని విషయాలనుగూర్చి ముచ్చటిస్తాను.

శ్రీకృష్ణరాయల ఆస్థానాన్ని అలంకరించిన తెలుగు కవులలో నలుగురినిగూర్చి మాత్రమే పరిశోధకులలో భిన్నాభిప్రాయములు లేవు. వారు ముక్కుతిమ్మన, అల్లసాని పెద్దన, మాదయ్యగారి మల్లన, ధూర్జటి. రాయల ఇతర ఆస్థానకవులుగా కొందరు భావించిన అయ్యలరాజు రామభద్రుడు, పింగళి సూరన, భట్టుమూర్తి రాయల ఆస్థానకవులు కారని శ్రీరామమూర్తిగారు చెప్పిన విషయములు అంగీకరించదగినవే. కాని, తెనాలి రామలింగడు, కందుకూరి రుద్రకవులనుగూర్చి వారు వ్రాసిన విషయములు పునఃపరిశీలించదగినవి.

కృష్ణరాయల ఆస్థానంలో తెనాలి రామలింగడనే కవి ఉన్నట్లు, అతడు వికటకవి అని, రాయలకు ఆప్తుడని తెలిపే అనేక గాథలు ప్రచారంలో ఉన్నాయి. ఈ రామలింగడు విశ్వబ్రాహ్మణుడు, మల్లికార్జునుని కుమారుడు. పాండురంగ విజయము, పీరజన మనోరంజనము, ఆదిపురాణము, ఒక బూతుగ్రంథము ఇతని రచనలు.

"ఇది యాది పురాణాది సద్గ్రంధకార, కృష్ణరాయదత్త తెనాల్యగ్రహార, తెనాలి వంశపవిత్రార్య జనస్తోత్ర, మల్లికార్జున తనూభవ రామలింగ నామధేయ ప్రణీతంబైన....బను మహాప్రబంధంబునందు సర్వంబు నేకాశ్వాసము" అన్న ఆశ్వాసాంత గద్యనుబట్టి ఇతడు కృష్ణరాయలచే తెనాలిని అగ్రహారముగా పొందినవాడని స్పష్టమౌతున్నది.

శృంగార రసాలింగిత
రంగత్కవితా నదీతరంగము హృదయ
త్వంగద్భుజంగ మాంగద
లింగమ్ము తెనాలి రామలింగము దలతున్

అని సరస్వతీ సోమయాజి అను కవి పృథు చరిత్రములోను,

రంగుగ బాండురంగుని తెలుంగలరంగ రచించి వేడ్కమీ
రంగ ఫలోక్తులన్ నృపుగరంగ నొనర్చు హొరంగు నింగి ము
ట్టంగ మెలంగునేరుపు గడంగి చెలంగు నభంగ సద్యశో
లింగుని రామలింగ శశలింగ కళానిధినిన్ గణించెదన్.

అని నల్లూరి నరసింహకవి నాగ్నజిత్తీ పరిణయంలోను ఈ రామలింగని గురించి వ్రాశారు. రామలింగని పాండురంగ విజయములోనివని కొన్ని పద్యాలను ఇదివరలో పండితులు ఉదాహరించారు కూడా. 'బయగ్రాఫికల్ స్కెచెస్ ఆఫ్ దక్కన్ పొయిట్స్' అన్న గ్రంథంలో కావలి వేంకట రామస్వామిగారు రామలింగడు క్రీ.శ. **1462**లో జన్మించాడని, ఇంటిపేరు ఈశ్వరప్రెగడవారని వ్రాశారు. రామలింగని ఎన్నో చేష్టలను వివరించారు.

రామలింగడను పేరున ఉద్భటారాధ్య చరిత్రను వ్రాసి తరువాత రామకృష్ణుడను పేరున పాండురంగ మాహాత్మ్యము, ఘటికాచల మాహాత్మ్యములను వ్రాసిన కవి పై రామలింగకవి కంటె భిన్నుడు. ఆచార్య శ్రీరామమూర్తిగారు చెప్పినట్లు ఈ రామ(లింగ)కృష్ణకవి రాయల ఆస్థానకవి కాడు.

ఇక కందుకూరి రుద్రకవి విషయము. కందుకూరి రుద్రకవి అన్న పేరుగల కవి ఒక్కరే అని శ్రీ శ్రీరామమూర్తి గారి అభిప్రాయమైనట్లు తోస్తున్నది. ఇది సరికాదు.

కృష్ణరాయల ఆస్థానంలో అష్టదిగ్గజాలలో ఒకడుగా పన్నెండేండ్లపాటు భువనవిజయసభలో ఈశాన్య సింహాసనాన్ని అధిరోహించినవాడుగా ఒక రుద్రకవి ఉన్నట్లు పండితలోకంలో ప్రతీతి ఉన్నది. ఇతడు 'సరసజన మనోరంజనం' అన్న ప్రబంధకర్త అట. ఒక చాటుపద్యంలో ఇతడి ప్రసక్తి ఉన్నది.

హరియౌ స్కందపురీజనార్దను వరంబందెన్ మహాసత్కవీ
శ్వరులౌ రాయలవారి సన్నిధిని హర్షంబందె బట్టంబు గ
ట్టిరి యాందోళికలున్ జవోగ్రతర ఘోటీ లగ్రహారంబు లం
దడ చూడన్ బహుమానమందె గవిరుద్రాఖ్యుండు తాముఖ్యుడై

మొదట ఈ రుద్రకవికి రాయలవారి ఆస్థానమున ప్రవేశం లభించకపోతే, మంగలి కొండోజీ ప్రవేశాన్ని కల్పించేదానికి సహాయపడినట్లు జనశ్రుతి ఉన్నది. జనశ్రుతే ప్రమాణమా? అంటే-తద్విరుద్ధంగా బలమైన ఇతర ఆధారాలు లభించేవరకు, అది కట్టుకథ అని నిరూపింపబడేవరకు వివేక మంగీకరిస్తే జనశ్రుతిని నమ్మవచ్చును. ఆచార్య శ్రీరామమూర్తిగారు చెప్పినట్లు భువన విజయసభా నిర్మాణము 1515లో జరిగితే, అష్టదిగ్గజ కవిగా రుద్రకవి 1?సం॥ ఆ సభలో ఈశాన్యపీఠాన్ని అధిరోహిస్తే అష్టదిగ్గజ సంప్రదాయం 1527వరకు ఉన్నదని ఊహించటములో దోషం లేదు. తిప్పలూరు శాసన విషయం దీనికి ఉపబలక మౌతుంది

నిరంకుశోపాఖ్యానము, సుగ్రీవ విజయములను రచించిన రుద్రకవి రాయల ఆస్థానకవికంటె భిన్నుడు. శ్రీరామమూర్తిగారు ఈతనిగురించే వ్రాశారు.

కాబట్టి పెద్దన, తిమ్మన, మల్లన, ధూర్జటి కవులతోపాటు విశ్వబ్రాహ్మణుడైన తెనాలి రామలింగడు, ఈశాన్యపీఠాన్ని అధిరోహించిన కందుకూరి రుద్రకవి కూడా రాయలవారి ఆస్థాన కవులే, అష్టదిగ్గజ కవులలోనివారే.

అష్టదిగ్గజకవులలో చేర్చదగిన మరొకకవి కృష్ణరాయలచే రాధామాధవ కవిగా బిరుదమందిన చింతలపూడి ఎల్లన.

రాధామాధవ మచ్యుతాంకితముగా బ్రౌఢక్రియం జెప్పి త
న్మాధుర్యంబున గృష్ణరాయవిభు గర్ణాటేశు మెప్పించి నా
నాధాత్రప్రతిమాన సత్కవులలోనన్ భూషణశ్రేణితో
రాధామాధవ నామమందిన జగత్ప్రఖ్యాత చారిత్రుడన్.

అని ఎల్లన తననుగూర్చి చెప్పుకొన్నాడు. ఇతడు శ్రీరామమూర్తిగారు చెప్పిన రాయల ప్రాభవకాలములోనే ఉన్నవాడు.

రాధామాధవ కవితో చేరి ఏడుగురైనారు. ఎనిమిదవ కవి ఆచార్య శ్రీరామమూర్తిగారు చెప్పిన కృష్ణరాయభూషణుడు కావచ్చును. తెలుగువారే అష్టదిగ్గజకవులుగా రాయల ఆస్థానమును అలంకరించి ఉందురు.

అష్టదిగ్గజకవి సంప్రదాయ మెప్పుడేర్పడినదో స్పష్టంగా తెలియదు. భువన విజయ సభానిర్మాణంతోనే ఈ సంప్రదాయం ఏర్పడితే పారిజాతాపహరణ రచనాకాలమునాటికే ఇది కలదని స్పష్టము. అట్లయిన అప్పటికి చింతలపూడి ఎల్లన అష్టదిగ్గజకవి కాలేదు. అతని స్థానమున ఆంధ్రేతర కవి ఉండి ఉండవచ్చును. అష్టదిగ్గజకవులలో కాలక్రమేణ మార్పులు, చేర్పులు జరిగిఉండ వచ్చుననుటకు అవకాశము లేకపోలేదు.

అష్టదిగ్గజకవులలో ఇతర భాషాకవులు కూడా కలరనే అభిప్రాయాన్ని కొందరు పరిశోధకులు, పండితులు వ్యక్తపరిచారు. ఈ విషయమై వ్రాస్తూ ఆచార్య శ్రీరామమూర్తిగారు రాయవాచకములోని ఈ క్రింది భాగాన్ని ఉద్ధరించారు.

"—నగరి విద్వాంసులు చతుర్వేది రామాదీక్షితులు అష్టభాషాకవిత కృష్ణావధానులు. శాబ్దికం పాండిత్యం వెంకట రామశాస్త్రుర్లు సహస్రావధాని ప్రభాకరశాస్త్రుర్లు జోస్యులు కవీశ్వరులు మరిన్ని గలిగిన పిన్న పెద్దలు...."

ఇందులో అయిదుగురు విద్వాంసులు పేర్కొనబడగా, శ్రీరామమూర్తిగారు అష్టభాషాకవిత కృష్ణావధానులుగారిని ఒకరినే రాయలవారి ఆస్థానకవిగా గ్రహించారు. మిగిలినవారిలో వేద పండితులైన రామాదీక్షితులుగారిని మినహాయిస్తే, సహస్రావధాని ప్రభాకరశాస్త్రిలుగారు, జోస్యులు కవీశ్వరులుగారు, వెంకటరామ శాస్త్రిలుగారు కూడా రాయల ఆస్థానకవులుగా చెప్పదగినవారే. వీరందరిని వదిలి ఒక్క కృష్ణావధానులుగారినే శ్రీరామమూర్తిగారు ఎంచుకోవటము న్యాయముకాదు.

సంస్కృత కవుల విషయానికివస్తే సంగీత సూర్యోదయమును రచించి బండారు లక్ష్మీనారాయణ కవి రాయలకు ఎంతో ప్రీతిపాత్రుడు

శ్రీమత్కృష్ణ నరేశ్వరస్య దయయా స్వర్ణాంచితాం పాలకీం
ముక్తాగుచ్ఛ కృతానుబద్ధవలయం ముక్తాత పత్రద్వయం
శశ్వత్ మత్తమతంగజా న్మలహరీ వాద్యం నిజాంతఃపుర
స్థానే నాట్య రసాధిపత్య మసకృల్లక్ష్మీమతిః ప్రాప్తవాన్

ఇన్ని సత్కారాలను పొందినవాడు ఆస్థానకవి, అష్టదిగ్గజ కవి కాజాలడా? ఇంకా, దివాకరకవి, లొల్లలక్ష్మీధరుడు కూడా రాయల నాశ్రయించినవారే "కర్ణాటాధిప కృష్ణరాయ సదసి ఖ్యాతస్య విద్వత్తయా" అని చెప్పుకొన్నవారు ఆస్థానకవులు కాకుండుట ఎట్లు? అలాగే డిండిమ కుటుంబానికి చెందిన 'సభాపతి', రాజనాథకవి కూడా రాయల ఆస్థానకవులే అని పరిశోధకుల భావన.

ఇతర భాషాకవులలో కన్నడకవి తిమ్మణ్ణ కృష్ణరాయలకు ఒక గ్రంథాన్ని అంకితమిచ్చాడు. కనుక ఇతడు రాయల ఆస్థానకవే. పురి చాటు విట్ఠలనాథకవి కూడ రాయల ఆస్థానకవే నంటున్నారు శ్రీరామమూర్తిగారు. తమిళకవి హరిదాసు రాయల తొలినాటి ఆస్థానకవి అని, అనంతరకాలమున కృష్ణరాయలు 'కాటూరు' అను దక్షిణ ద్రవిడదేశగ్రామముపై దండెత్తినపుడు ఈ తమిళకవి మనస్తాపము జెంది రాయల ఆస్థానాన్ని వీడినట్లు ఆచార్య శ్రీరామమూర్తిగారి కథనము. ఇది విశ్వసించదగిన విషయముగా కన్పించదు. రాయలు సింహాసనస్థుడు కాగానే రాయచూరును స్వాధీనపరచుకొని తరువాత దక్షిణదేశమున తిరుగుబాటు చేసినవారిని అణచివేసి తన అధికారాన్ని స్థిరపరచు

కొన్నాడు. రాయల దక్షిణదేశ దండయాత్ర హరిదాసుకు మనస్తాపము కలిగించు విషయమైతే, అతడు తొలిరోజులలోనే రాయాస్థానమును చేరిఉండడు. కాబట్టి హరిదాసు రాయలను నిరసిస్తూ అతడి ఆస్థానాన్ని విడిచి వెళ్ళాడన్న శ్రీరామమూర్తి గారి వ్రాత విశ్వసింపదగినది కాదు. హరిదాసు రాయల ఆస్థాన కవే. ఇతడితోపాటు కుమార సరస్వతి, జ్ఞానప్రకాశర్, తత్త్వ ప్రకాశర్ అనే తమిళకవులు కూడా రాయల ఆదరణను పొందిన వారే అని పరిశోధకులు వ్రాశారు.

అష్టదిగ్గజ కవులలో సంస్కృతకవులు, ఇతర భాషా కవులు కూడ చేరిఉన్నట్లయితే అష్టదిగ్గజకవులను గుర్తించటం అంత సులభమైన పనికాదు. అష్టదిగ్గజకవులను ఎంపికచేసి ఆ సంప్రదాయాన్ని ఏర్పరచిననాటినుండి తుదివరకు ఆ కవుల జాబితాలో మార్పులు, చేర్పులు లేవనికూడా విశ్వసించలేము. రాయల ఆస్థానమున నవరత్న కవులున్నారనే అనుమానానికి కూడా ఇదే అవకాశమిస్తున్నది. ఏమయినప్పటికీ, ఈ విషయమై స్పష్టమైన నిర్ణయము చేయటానికి తగిన సాధన సామగ్రి ఇప్పటికి మనకు లభించలేదనే చెప్పవలసి ఉన్నది.

నందిదుర్గాలయ శాసన కాలమును నిర్ణయించటములో శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు పొరపడినట్లు ఇదివరలోనే పరిశోధకులు ప్రకటించారు. ఇప్పుడు ఆచార్య శ్రీరామమూర్తి గారు 'శాసనమే కూటసృష్టి' అంటున్నారు. ఇంతకూ అది అష్టదిగ్గజకవులను ఎంపిక చేయటానికి ఉపకరించదు గదా! అష్టదిగ్గజకవి సంప్రదాయము ఎన్నాళ్ళు ఉన్నదోకూడ నిర్ణయించటము కష్టమే. చరిత్ర పరిశోధకుల గవేషణా ఫలితముగా రాయలవారు అష్టదిగ్గజకవులకు ధారవోసిన తిప్పలూరు శాసనము బయల్పడి ఈ విషయమై స్పష్టమైన చరిత్రను తెలుపగలదని ఆశిద్దాము.

డాక్టర్ సూర్యదేవర రవికుమార్

# నన్నయ - వృత్తౌచిత్యం

అంతటివఱకు శిలాశాసనములమీదనో, తామ్రఫలకముల పైననో పడియున్న ఆంధ్రసరస్వతిని గ్రంధస్థము చేయుట ద్వారా చక్కని రూపమును కల్పించిన ప్రధమాచార్యుడు నన్నయ. ఆయన తన మహాభారత అవతారికలో, తాను నానారుచిరార్థసూక్తి నిధిననియు, తన రచనలో "ప్రసన్నకథా కవితార్థయుక్తి" "అక్షర రమ్యత" మున్నగు కవితాగుణము లున్నవని పేర్కొన్నారు. ఇవిగాక వృత్తౌచిత్యమును పాటించుట, తానుపయోగించెడి వృత్తములద్వారా భావికథను సూచించుట మొ॥ ఆయన కవిత్వములోని మరికొన్ని విశేషములు. ఈ వ్యాసంలో ఆ విషయమునకు సంబంధించిన కొన్ని ముఖ్యమైన విశేషములు పొందుపరుపబడుచున్నవి.

కావ్యారంభములో నన్నయగారు కృతిభర్తయగు రాజరాజ నరేంద్రుని గుణగణములను ఉత్పలమాలా వృత్తములో రచించిరి. (రాజకులైకభూషణుఁడు ...........రాజమహేంద్రుడున్నతిన్) ఇచట కృతిభర్తను ఉత్పలమాలనొసగి సత్కరించుట ఆయన వృత్తౌచిత్యమునకు ఒక ఉదాహరణ. అట్లే ఉదంకో పాఖ్యాన మట్టమున ఉదంకునిచే

"బహువన పాదపాబ్ధి కులపర్వత..........మాకుఁ బ్రసన్ను
డయ్యెడున్"

"అరిదితపో విభూతి నమరానుల..........మాకు బ్రసన్నుఁ
డయ్యెడున్"

"దేవ మనుష్య లోకముల..........మాకుఁ బ్రసన్నులయ్యెడున్"

"గోత్రమహామహీధర నికుంజములన్..........బ్రసన్ను
డయ్యెడున్"

రెండు ఉత్పలమాలలను, రెండు చంపకమాలలను ప్రసాదింపఁజేసి నాగపతులను శాంతింపఁజేసినాడు. సర్పములు చంపక ప్రియములగుటచే ఉత్పలములతోబాటుగా చంపకములను కూడ జోడించి ఉదంకునకు ప్రసన్నము కావించినాగు. ఇది నన్నయగారి వృత్తౌచిత్యమునకు మఱొక ఉదాహరణ.

అట్లే ఆదిపర్వములోని చతుర్థాశ్వాసగత దుష్యంతోపాఖ్యాన ఘట్టమందు, దుష్యంతుడు మాలినీ నదీతీరమున గల కణ్వాశ్రమమున ప్రవేశించగానే అచటనున్న లతాదులు అతనికి అనేకవిధములగు నుపచారములుచేసి యతని శ్రమమును బాపినవి.

ఆ మున్యాశ్రయోపాంత వనములను కవి రెండు పద్యములలో వర్ణించెను. అవి "మానిని" "కవిరాజ విరాజితము" అనువృత్తములు. ఆ పద్యములివి-

మానిని :

"ఏచి తనర్చి తలిర్చిన క్రోవుల నిమ్మగుతావుల జొంపములం
బూచిన మంచి యశోకములన్ సురపొన్నలఁ బొన్నల గేదగులం
గాచి బెడంగుగ బండిన యా సహకారములం గదళీతతులం
జూచుచు వీనుల కింపెసగన్ వినుచున్ శుకకోకిల సుస్వరముల్"
(4ఆ. 20)

* * *

కవిరాజ విరాజితము :

"చనిచని ముందట నాఙ్యహవిర్భృత సౌరభ ధూమల తాతతులం
బెనగిన మ్రాకుల కొమ్మలమీద నపేతలతాంతములైనను బా
యని మధుప ప్రకరంబులఁజూచి జనాధిపుఁడంత నెఱింగెఁదపో
వనమిదియల్లదె! దివ్యమునీంద్రు నివాసము దాఁగునంచునెడన్
(4ఆ. 21)

ఆశ్రమ వర్ణన విషయమటుండనిండు. ఇచట స్వీకరింపబడిన "మానిని","కవిరాజ విరాజితము" అను రెండు వృత్తములను బట్టి దుష్యంతుడు త్వరలో అభిమానవతి (మానిని యనగా

మానము గలది) యగు ఒక వనితను చూచుననియు, ఆమె సామాన్య వనిత కాదనియు "కవిరాజ విరాజిత" యనియు (పక్షి రాజులచే రక్షింపబడినదనియు) సూచింపబడుచున్నది.[1] ఇది నన్నయగారి వృత్తౌచిత్యమునకు ఒక ప్రబలోదాహరణము.

అదేవిధముగా పంచమాశ్వాసమున (ఆదిపర్వములోని) నకుల సహదేవ జననఘట్టమున నన్నయగారు వసంతకాల సౌందర్యమును ఈ క్రిందిరీతిలో వర్ణించినారు.

లయగ్రాహి :

కమ్మని లతాంతముల కుమ్మొనసివచ్చు మధుపమ్ముల సుగీత
నినదమ్ము లెసగంజూ
తమ్ముల లసత్కిసలయమ్ముల సుగంధి ముకుళమ్ములను
నానుచును దమ్మొసరవాచా
లమ్ములగు కోకిల కులమ్ముల రవమ్ము మధురమ్మగుచు విన్చెనని
శమ్ము సుమనోభా
రమ్ముల నశోక నికరమ్ములను జంపకచయమ్ములును గింశుక
వనమ్ములను నొప్పెన్

లయగ్రాహి :

"చందనతమాల తరులందునగ రుద్రుమములందు గదళీవనము
లందులవలీమా
కందతరుషండములయందు ననిమీలదరవింద సరసీ వనములందు
లవలీమా
కందళిత పుష్పమకరంద రసముందగులు చందనువు సౌరభము
నొంది జనచిత్తా
నందముగ బ్రోషితుల డెందముల అందురుగ మంద మలయా
నిలము మందగతి వీచెన్"

పై పద్యములు "లయగ్రాహి" వృత్తములు. అందును అవి రెండే. ఇచట కవి రెండు లయగ్రాహి వృత్తములచే (లయము=నాశనము) ఇరువురి వినాశనమును సూచించినాడు.

1. అమ్మాలినీ పులినతలంబున శకుంతరక్షితయై యున్న కూతు....
ఆది. 4. వచనం 48

ఈ వసంతశోభచే పాండురాజు మదనసమ్మోహన మార్గణ విదళన మందీకృత హృదయుడై మాద్రితో సంభోగించెను. ఇదివఱలో నాతడు పొందిన శాపమువలన తక్షణమే విగతజీవుడయ్యెను. పిమ్మట మద్రరాజపుత్రియు పతితోడన చితారూఢయై యగ్నిశిఖలనప గత ప్రాణయయ్యెను. ఆ విధముగా నట ఇరువురును మరణించిరి. నన్నయగారు జరుగబోవు వీరిద్దరి మరణమును సూచించుటకై వసంతకాలమును "లయగ్రాహి" వృత్తములలో వర్ణించిరి. అట్లుగానిచో నన్నయగారు అంత ప్రసిద్ధముగాని "లయగ్రాహి" వృత్తములనే ఏల ఉపయోగించెను? అందును రెండు వృత్తములనే వ్రాయనేల? ఒకటి వ్రాయవచ్చును లేదా రెంటికంటె ఎక్కువ వ్రాయవచ్చును గదా! అంతేగాక వారి మరణమునకు వసంతకాలమే కారణమగుటచే ఆ పద్యములలో వసంతశోభయే వర్ణింపబడినది. ఇది నన్నయగారి వృత్తౌచిత్యమునకు మరొక ఉదాహరణము.

మఱియు ఆదిపర్వమునందలి షష్ఠాశ్వాసమున కౌరవ పాండవులు గురుదక్షిణార్థము, ద్రుపదుని బంధించి తెచ్చు ఘట్టమున ఉత్సాహోపేతమైన వారి ప్రయాణ సంరంభమును "ఉత్సాహ వృత్తము"లో వర్ణించుట మరొక్క నిదర్శనము.

ఉత్సాహము :

"ఏల దీనినెడయఁజేయు నీక్షణంబ యేగి పాం
చాలుఁబట్టి తెత్తమధిక శౌర్యలీల మెఱయగాఁ
బోలుననుచుఁ బెరిగి రాజపుత్త్రులరిగి యార్చిపాం
చాలు పురము ముట్టికొనిరసంఖ్య బలసమేతులై"

(ఆది. 6ఆ. 66వ పద్యం)

స్థాలీపులాక న్యాయముగా ఇచట కొన్ని ఉదహరింపబడినవి. తక్కిన విశేషములను సహృదయులగు పాఠకు లరయుదురుగాక.

డా॥ చిలకమర్తి. దుర్గాప్రసాదరావు

# “ఏమండీ. ఆ భరించలేని నొప్పి ఏమైంది?”

“పోయిందే!”




మేలుపరచబడిన **అమృతాంజన్** వాడడంతో,

కోమలమైన అమృతాంజన్‌ను చాలా సులభంగా రాసుకోవచ్చు.

**మృదువైన అమృతాంజన్‌తో చాలా సులభంగా 'మర్దనా' వేయవచ్చు.**

తలనొప్పులను, వొళ్ళు నొప్పులను, కీళ్ళ నొప్పులను, కండరాల నొప్పులను మరియు బెణుకులను మేలుపరచబడిన అమృతాంజన్ మునపటికంటే **అతి** త్వరితంగా వుపశమింపజేయగలదు !

## మేలుపరచబడిన
# అమృతాంజన్

మీ మోముపై చిరునగవులను శీఘ్రంగా- తిరిగి వికసింపజేయగలదు!



Amrutanjan Limited

OBM 149 TG R

# గ్రంథ విమర్శలు

## రాణిరుద్రమదేవి

[రచయిత్రి: గూడపాటి కృష్ణకుమారి, యం.ఎ., యం.ఫిల్, పి.ఒ.యల్. ప్రతులకు - నవభారతి, లంకవీథి, విజయనగరం-531 202, వెల-పది రూపాయలు]

ఇది 80 పుటలు, కొన్ని బొమ్మలుగల గ్రంథం. ఆంధ్ర సాహిత్య అకాడమీ బహుమతి పొందిన బాలల గ్రంథం. కనుక ఈ గ్రంథాన్ని విశేషించి సమీక్షించడం అనుచితం అనిపిస్తుంది. అయినా ఉత్తీర్ణతను తెలుపుచూ డిగ్రీ సర్టిఫికెటువంటిది ఉన్నప్పటికి ఉన్నత తరగతిలో చేరటానికి ఎంట్రన్సు పరీక్ష అవసరమంటున్నారు. అట్లాగే బహుమతికి అర్హతను పొంది నప్పటికి యీ గ్రంథాన్ని సమీక్షకు పంపారు.

కాకతీయ చరిత్రలో ఒక స్త్రీ కూడ రాజ్యం చేయటం విశేషమే. ఆమె విశిష్ట గుణములను తెలుపుచు బాలల సాహిత్యంలో ఈ గ్రంథం వెలువడటం ముదావహము. చరిత్రలోగల నిజాలు, కథలో ఉండే కల్పనలు ఇట్లాంటి రచనల్లో కనుపిస్తూ వుంటాయి. కాకతీయ చరిత్రను కొంతగా తెలిపే ప్రతాపచరిత్ర, సిద్ధేశ్వర చరిత్ర, సోమదేవ రాజీయము అనే మూడు గ్రంథాలు ఇట్లాంటి సాహిత్యంలో చేరిన 16-18 శతాబ్దాలనాటి రచనలు. అప్పటికింకా పరిశోధనాత్మకంగా చరిత్ర రచనలు చేయుట మొదలు కాలేదనవచ్చు. అందువల్ల ఈ మూడు గ్రంథాలు కాకతీయ చరిత్రను కొంతగానే తెలుపుచుండును. కొన్ని అసంబద్ధ విషయాలు కూడ వాటిలో గలవు. కాని ప్రస్తుత సమీక్షాంశమైన 'రాణి రుద్రమదేవి' గ్రంథం కాకతీయ చరిత్రలో కొన్ని పరిశోధనాత్మక రచనలు వెలువడిన తరువాత వ్రాయ బడింది కనుక పైన పేర్కొన్న గ్రంథాలకంటే మెరుగైయుండ వలెను. పరిశోధకులకు కాక బాలల కుపయోగించేదైనా నిజాలు కానట్టి కొన్ని విషయాలను లేతమనస్సుల్లో నాటాలనే ఆరాటం ఎక్కువగా కనిపిస్తుంది యీ రచనలో. బాలలకు ఆకర్షణీయంగా వుండేవిధంగా వ్రాయటం అవసరమే. అట్లాగని సత్యాన్ని మరుగుపరచేవిధంగా వుండకూడదు. ఇందున్న మొదటి శీర్షిక 'వంశం పుట్టుపూర్వోత్తరాలు' అనేదాంట్లో వ్రాసింది యెక్కువగా అసంబద్ధమైన కట్టుకథలేనని చెపుతూనే వాటికి ప్రాధాన్యం ఇవ్వ బడింది కాకతీయులు తెలుగువారు కాదనే ఆధారాలు బలమైనవి కనుపిస్తుండగా వారిని యిచట స్థిరపడిన కర్షక జాతిగాను, కమ్మ కులజులుగాను చిత్రించటం సమ్మతమైన విషయం కానేరదు. వారు మొదటినుండి ఆయుధోపజీవులుగానే చరిత్రలో తెలియ వచ్చుచున్నారు. రేనాటి చోళులవలెగాని, వైదుంబరాజులవలెగాని వారు తెలుగు శాసనాలు మొదట్లో వేయించలేదు. వారి మొదటి శాసనాలు కన్నడంలో కనుపించాయి. కన్నడరాజులైన రాష్ట్రకూట చక్రవర్తుల క్రింద సైనికోద్యోగులుగా నుండియుందురను టకు ఆధారములు గలవు. బెల్గాంవద్దనున్న కాకతి నగరం వారి మొదటి తావు కావచ్చును. బయ్యారం చెఱువు శాసనం వారి మూలపురుషుడైన వెన్నమరాజు కాకతినుండి పాలించేవాడని చెపు తోంది. అట్టి సమాచారం తెలుస్తుండగా వారిని తెలుగుదేశంలో నున్న కమ్మనాటి కర్షక కాపులుగా వ్రాయటం అవసరంలేదు. ఈ రచనకు 1961 జనాభా సేకరణలోని వ్రాత ఆధారంగా పేర్కొనబడింది. భావి పరిశోధకులుగానున్న యిప్పటి బాలలకు ఈ గ్రంథం ఆధారంగా కారాదు. వారు కర్షక కాపులనే అంశం కూడ గుమ్మడి తీగె కథవంటిదే. ఇట్లాంటి విశ్వసింపజాలని కట్టుకథలతో మొదటిపారం అసందర్భంగా నడిచింది. రాజ వంశాల పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకోవటం అతి కష్టం. అందుకని పిల్లలకు చెప్పేటప్పుడు మనవాళ్లు 'అనగా అనగా ఒక రాజు' అనే వరవడి పెట్టుకొన్నారు. ఈ వరవడి తప్పదలచు కొంటే ప్రమాణబద్ధంగా చెప్పటం మంచిది.

రెండవ శీర్షికలో కాకతీయుల రాజధానియైన ఓరుగల్లు నిర్మాణము, అందుండే వివిధ భాగాలు వర్ణించబడెను. తరువాతి

ప్రకరణంలో రుద్రమదేవియొక్క బాల్యము, వివాహము. ఈ సందర్భంలో రచయిత్రి విషయాన్ని పిల్లలకి బాగుండేట్లు కథా రూపంలో చెప్పారు. నాలుగోపాఠంలో రుద్రమదేవియొక్క పట్టాభిషేకం చక్కగా వర్ణించబడింది. కాని యీ సందర్భంలో కనీసం ఒకటి రెండుచోట్ల క్రీస్తుశకంలోనైనా సంవత్సరం తెలిపితే బాగుండేది. లేకపోతే పిల్లలకైనా యిదియొక కథగానే అర్థమై, అందలి చారిత్రక ప్రాధాన్యం పోతుంది. చెప్పేది చారిత్రక విషయం కనుక తేదీలు ముఖ్యమగుచోట్ల తెలుపుటవల్ల పిల్లలకైనా యిది జరిగిన కథయేనని ఆసక్తి కలుగుతుంది.

తరువాతి అధ్యాయాల్లో కుట్రలు, రుద్రమదేవి చేసిన ముఖ్యయుద్ధములు, పరిపాలనాపటిమ, ఆమె కుటుంబము, సాంస్కృతికాభివృద్ధి మొదలైనవి వర్ణించబడెను. తుదిలో పిల్లల కుపయుక్తమగునట్లు కొన్ని పదములకు వివరణ లొసగబడెను. మొదట్లో కాకతీయ రాజ్యవిస్తీర్ణము తెలియజేయు పటము చేర్చబడెను. అందులో కడప మండలంలో చూపవలసియున్న రేనాడు అనంతపురం కర్నూలు మండలాల నడుమ చూపబడెను. అది పటము గీచినవారి పొరపాటైయుండును. బాలల సాహిత్యానికి ఈ మంచి పుస్తకాన్ని అందించినందుకు రచయిత్రి ప్రశంసార్హురాలని చెప్పవలెను.

# సప్తస్వర

(ఇంగ్లీషు)

(యస్. యస్. కృష్ణమూర్తి, యం.ఎ., బి.యల్, మూలపేట-నెల్లూరు-3; వెల: రూ. 15/)

గ్రంథకర్త ఆంగ్లములో రచించిన యేడు వ్యాసముల కూర్పు ఇది. ఇందులో మొదటి రెండు వ్యాసములు డా॥ ఎ. కె. కుమారస్వామినిగూర్చి వ్రాసినవి. ఇవి రెండును చాల అమూల్యమైనవి. భారతీయ సంస్కృతి పరిశోధకులలో ఎ. కె. కుమారస్వామి ప్రథమగణ్యుడు. ఆయన పూర్తిపేరు ఆనంద కెంటిష్ కుమారస్వామి. ముతు కుమారస్వామి అను సింహళ ద్రావిడ బారిష్టరుకి ఎలిజబెత్ క్లె బీబి అను ఆంగ్లవనితకు 1877లో జన్మించెను. భారతీయ శిల్పకళలో ఇమిడియున్న భారతీయ ఆధ్యాత్మిక తత్త్వమును వివరించగలిగిన పరిశోధకుడు ఆనంద కుమారస్వామి యొక్కడేనని శివరామమూర్తివంటి భారతీయ కళావేత్తలు ఆయనను కొనియాడిరి. ఆయన బోస్టన్ మ్యూజియంలో క్యూరేటర్‌గా మూడు దశాబ్దములుండి వివిధ దేశపు కళలనుగూర్చి పరిశోధనలు సలిపెను. సంస్కృతము, పాలి, తమిళమువంటి భారతీయభాషలలోను, ఫ్రెంచి, ఆంగ్లము, గ్రీకు, లాటిన్, జర్మన్‌వంటి పాశ్చాత్య భాషలలోను కుమారస్వామి పాండిత్యము గలవాడు. ఆయా భాషలలో గల కళా విజ్ఞానమును, వేదాంతమును ఆకళింపు చేసుకొన్న మహామనీషి అతడు. ఆయా భాషలలో ప్రచురింపబడెడి అనేక పరిశోధన పత్రికలలో ఆయన అనేక వ్యాసములు ప్రకటించెను. సారాంశముగా భారతీయ సంస్కృతినే సిద్ధాంతీకరించువాడు. ఉన్న విషయమును బహిర్గతముగా వ్యక్తబరచుటయేగాని యేదియు తన స్వామ్య హక్కులతో రూపొందినది కాదని చెప్పువాడట. అట్టి ప్రజ్ఞాశాలిని గూర్చిన విశేష భావములను ప్రస్తుత వ్యాసములు రెండు సూచించును. మతొక వ్యాసము చిత్రకళయొక్క వైశిష్ట్యమును గూర్చి చెప్పును. ఇందు చిత్రకళయొక్క ఆవిర్భావము, అందలి ఆధ్యాత్మికదృష్టి, చిత్రకళను గూర్చి చెప్పిన ముఖ్య గ్రంథములు, తెలుగు కావ్యములలో చిత్రకళను గూర్చి చెప్పినది, బౌద్ధగ్రంథములు దాని ప్రసక్తి, అధునాతన పోకడలు మున్నగు అంశములు వివరించబడెను. ఆ తరువాత అధ్యాయములో నాట్యమునుగూర్చి చెప్పబడెను. ఇందు శివుడు సప్తస్వరమూర్తిగా బొంబాయి సమీపమున పరేల అనుచోట యేడు మూర్తులు యేడు స్వరములను సూచించునట్లొక శిల్పము మలచబడియున్నదని దానినిగూర్చి వివరించబడెను. గ్రంథమునకు ముఖ్యముగా దీనినిబట్టియే ఆ పేరొసగబడెను. తరువాత అధ్యాయములోగూడ నాట్యమునుగూర్చి పల్నాటి వీరచరిత్ర నుండి యొక సన్నివేశము వివరించబడెను. తుది అధ్యాయము గోదావరి నది ప్రవహించు ప్రాంతము వర్ణించబడెను.

గ్రంథము ఈవిధంగా పలురకములైయున్నను అన్ని అంశములు క్రొత్తగా కొన్ని విశేషములను తెలుపుచున్నవి.

పి. వి. పరబ్రహ్మశాస్త్రి

# గ్రంథ స్వీకారాలు

## శ్రీనివాస విభూతి

రచయిత: కీ.శే. వాసా సూర్యనారాయణశాస్త్రి ప్రతులకు: వి. వి. రమణమూర్తి, 9-1-12, వాటర్ వర్క్స్ వీధి, రాజమండ్రి-1 వెల: రు. 5/-

## మాధవశతి

రచయిత: వేదాటి రఘుపతి ప్రతులకు: వి. రఘుపతి, తెలుగు ఉపన్యాసకులు, శ్రీ వేంకటేశ్వర డిగ్రీ కళాశాల, సూర్యాపేట-508 213. వెల. రు. 5/-

## శ్రీ వెలగొండ వేంకటేశ్వర శతకము

రచయిత: చేతన, ప్రతులకు: శ్రీ వాణీ పబ్లికేషన్స్, 3-6-69 పంపింగ్ బావి రోడ్, ఖమ్మం. వెల. రు. 5/-

## మహాభాషిత రత్నాకరం

రచయిత: మేడూరి శేషగిరిరావు ప్రతులకు: ఎం. శేషగిరి రావు, గంటలమ్మ చెట్టు దగ్గర, గుంటూరు - 522 003 వెల. రు. 10/-

## శ్రీ కనకధారా స్తవము

అనువాదకులు: కీ.శే. బూర్గుల రామకృష్ణరావు ప్రతులకు: పింగళి-కాటూరి సాహిత్యపీఠం, కేర్. మాధవి ప్రింటర్స్, కుల్సిగూడా, హైదరాబాద్-27. వెల. రు. 4/-

## సుభాష్ చంద్రబోస్

రచయిత: గౌతమ్ చటోపాధ్యాయ ప్రతులకు:విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్-500 001, వెల. రు. 3/-

## శ్రీ కురుమూర్తి శ్రీనివాసశతకము

రచయిత: వైద్యమ్ వేంకటేశ్వరాచార్యులు; ప్రతులకు: శ్రీమతి వి. పుష్పావతి, ఇ. నెం. 2-53, కల్లూరు పోస్టు, కర్నూలు జిల్లా. వెల: తెలుపలేదు.

## శ్రీదత్తప్రభు శతకము

రచయిత: క్రిష్ణపాటి వేంకట సుబ్బకవి, ప్రతులకు: అధ్యక్షుడు, శ్రీ గురుదేవదత్త ధరణి సీతారామస్వామి భక్త సమాజము, ఎస్. లింగందిన్నె గ్రామం, ఆళ్లగడ్డ మండలం, కర్నూలుజిల్లా, వెల: రు. 3/-

## శ్రీదత్తావధూత శతకము

రచయిత: రంగయామాత్యుని రామకృష్ణకవి, ప్రతులకు: అధ్యక్షులు, శ్రీ గురుదేవదత్త ధరణి సీతారామస్వామి భక్త సమాజము; ఎస్. లింగందిన్నె గ్రామము, ఆళ్లగడ్డ మండలం, కర్నూలుజిల్లా. వెల. రు. 3/-

## శ్రీ సాయి చరితమ్

(రచన: వి. వేంకటేశ్వరరావు, ప్రతులకు: బాపూజీ ప్రింటర్స్, నెహ్రూనగర్, గుంటూరు-522 001. ధర: లేదు. సాయి భక్తులకు ఉచితం).

శ్రీ షిరిడి సాయిబాబా దివ్యకథలో సూక్తిసుధతో నిండిన చిరుపుస్తకం ఇది. సద్గురు స్తుతికి భక్తులకు ఈ పుస్తకం ఎంత గానో దోహదపడుతుంది. ఆసక్తి కలవారు ఎవరైనాసరే చదువదగ్గ విషయం.



Printed & Published for Nageswara Rao Estates Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press. Gandhinagar, Vijayawada-3. Editor . S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247